Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 14 • 5-4-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# సుడిగాలిలా సిఎం పర్యటన!

ఎండలు మండుతున్నాయి. వాటి కంటే అధికంగా కరెంట్ కష్టాలతో ప్రజల గుండెల్లో మంటలు చెలరేగుతున్నాయి. రాజకీయ వాతావరణం సెగలు పొగలు కక్కుతున్నది. మరొకరైతే ఈ నిప్పుల కుంపట్లో తలదూర్చే ప్రయత్నమే చేయరు. కానీ మన ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి మహా మొండి మనిషి. ఇవేవీ తనకు పట్టనట్లే జనం మధ్యకు వచ్చేశాడాయన. మూడు రోజులపాటు కాలికి బలపం కట్టుకొని నెల్లూరు జిల్లాలో వూరూరు తిరిగాడు. ఏమీ జరగనట్లు, జరుగుతున్న వాటితో తనకేమాత్రం నిమిత్తం లేనట్లు అమాయకంగా ప్రజలతో మాట్లాడాడు. చేసిన తప్పుకు ఈషణ్మాత్రం పశ్చాత్తాపం లేకుండా ఇదంతా మీ మేలు కోసమే చేస్తున్నాననే అమాయకం నటిస్తూ కాలం గడిపి వెళ్లి పోయాడు.

ముఖ్యమంత్రులు జిల్లా పర్యటనలకు రావడం, మూడు నాలుగు రోజులు మకాం పెట్టడం ప్రత్యేకమేమీ కాదు. కానీ జనంలో తన పట్ల, తన ప్రభుత్వం పట్ల, తన నిర్ణయాల పట్ల తీవ్రమైన క్రోధావేశాలు వెల్లువెత్తుతున్న సమయంలో పర్యటన తలపెట్టడమే విశేషం. మనుషులలో మొండి వారుంటారని తెలుసు కానీ మరీ ఇంత మహా మొండి ఘటాలున్నాయని కిరణ్‌కుమార్ రెడ్డిని చూస్తేనే అర్థమౌతున్నది.

సుడిగాలి వీచిన చందంగా తిరిగాడు ముఖ్యమంత్రి ఈ మూడు రోజులు. 1వ తేది మిట్ట మధ్యాహ్నం సోమశిలలో దిగాడు. హై లెవల్ కెనాల్‌కు శంకుస్థాపన, సోమశిల జలాశయం నుంచి లిఫ్ట్ ఇరిగేషన్ ద్వారా నీరుతోడి, వెంకటగిరి కొండ క్రింద పల్లెలకు జల స్పర్శ కల్గించాలన్న కోరిక ఎన్నాళ్ల నుంచో వుంది. స్వర్గీయ పాదిలేటి వెంకటస్వామి రెడ్డి వంటి నేతలు దాన్నొక జీవితస్వప్నంగా ఎంచుకొని ఆ కల నిజం కాకుండానే కడతేరి పోయారు. ఈ హైలెవల్ కాలువతో ఆ కోరిక వీడేరుతున్నది.

ముఖ్యమంత్రి కార్యక్రమాలలో ఇది కాక చెప్పుకోదగినవి – కృష్ణపట్నం ఓడరేవు కంటైనర్ టెర్మినల్ ప్రారంభం, సర్వేపల్లిలో యుపిఐ పాలిమర్స్ అనే పరిశ్రమకు రిబ్బన్ కత్తిరించడం, నెల్లూరు మెడికల్ కాలేజికి శంకుస్థాపించడం మాత్రమే. కృష్ణపట్నం ఓడరేవును ఆధునిక ఓడరేవులతో సమాన స్థాయిలో నిలబెట్టే నిర్మాణం కంటైనర్ టెర్మినల్. పారిశ్రామిక ఉత్పత్తులన్నీ కంటైనర్ల ద్వారా మాత్రమే రవాణా అవుతుంటాయి. ఇప్పటి వరకు కృష్ణపట్నం రేవులో ముడి ఇనుము, బొగ్గు, గ్రానైట్ రాళ్లు, ఎరువులు, చక్కెర వంటి వస్తువుల రవాణా మాత్రమే నడుస్తున్నది. కంటైనర్ వసతి ఏర్పడితే మద్రాసు పోర్టుతో సమానంగా పారిశ్రామిక సంస్థలు దీన్ని వినియోగించుకొంటాయి. దానివల్ల రేవు ప్రాధాన్యత పెరుగుతుంది. జిల్లాకు దీర్ఘకాలంలో ఎంతో ఉపయోగం వుంటుంది దానివల్ల.

నెల్లూరు మెడికల్ కాలేజి భవనాలకు శంకుస్థాపించాడు ముఖ్యమంత్రి. కాలేజి నిర్మాణం పనులు ఇప్పటికే వేగంగా నడుస్తున్నాయి. మెడికల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ డైరక్టర్‌గా మన మాజీ కలెక్టర్ రవిచంద్ర వచ్చినప్పటి నుంచి వీటి మీద ప్రత్యేక శ్రద్ధ చూపుతున్నాడు. ఈ విద్యా సంవత్సరంలోనే తరగతులు ప్రారంభించేందుకు సన్నాహాలు చేస్తున్నారు.

కొరవ 14వ పేజీలో

కృష్ణపట్నం ఓడరేవులో కంటైనర్ టెర్మినల్‌ను ప్రారంభిస్తున్న సిఎం.

## జగన్ పార్టీకి కొత్త అధ్యక్షుడు!

నెల్లూరుజిల్లా వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి కొత్త అధ్యక్షుడిగా మేరిగ మురళీధర్ నియమితుడైనట్లు తెలుస్తున్నది. బహుశా రేపో ఎల్లుండో ఈ మేరకు ప్రకటన విడుదల కావచ్చు. ఇప్పటి వరకు ఈ పదవిలో మాజీ జిప ఛేర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి వున్నారు. ఆయనకు, ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డికి ఉప్పులో నిప్పుగా వున్నాయి సంబంధాలు. నెల్లూరు రూరల్, నెల్లూరు నగర నియోజకవర్గాలకు తన అభిమతానికి విరుద్ధంగా అభ్యర్థిత్వ నిర్ణయం జరగడంతో రాజమోహన్‌రెడ్డి మరింత బిగుసుకపోయాడు. నాలుగైదు రోజుల నుంచి హైదరాబాదులోనే వుండి కూడా పార్టీ కార్యాలయానికి రాలేదు. అలుక పాన్పు ఎక్కాడు. అక్కడ నుంచి దించడానికి ఒక చిన్న బుజ్జగింపు – జిల్లా అధ్యక్ష పదవి మార్పు.

మేరిగ మురళి రాపూరు ప్రాంతానికి చెందిన దళిత కార్యకర్త. పాపకన్ను రాజశేఖర్‌రెడ్డి అనుచరుడు. గతంలో ఒకసారి జడ్పీటీసి సభ్యుడిగా పని చేశాడు. మాజీ జీప ఛైర్మన్ డాక్టర్ నాగభూషణమ్మను పదవి నుంచి దించడానికి జరిగిన ప్రయత్నంలో కీలక పాత్ర పోషించాడు. ఆయన పెద్ద తండ్రి మేరిగ రామకృష్ణయ్య

కొరవ 14వ పేజీలో

# వాటికన్‌లో మానవత్వ పరిమళం

మతం రెండు వైపులా పదునున్న కత్తి. దాని శక్తి మహత్తరమైనది. మనసులను స్వాంతన పరచగలదు; ద్వేషంతో కల్లోలపరచనూ గలదు. దాన్ని ఎట్లా వాడుకొంటున్నారన్నదే ప్రశ్న. అందువల్లనే స్వామి వివేకానంద విశ్వజనీనమైన మత సిద్ధాంతాన్ని ప్రభోదించాడు. సోదర భావాన్ని పెంపొందించేదిగా వుండాలని అభిలషించాడు. క్రైస్తవ మత నూతన సార్వభౌముడిగా ఎంపికైన పోప్ ఫ్రాన్సిస్ ఈ ఆదర్శ పోకడకు శ్రీకారం చుట్టారు. యావత్ మానవాళికి ఒక కొత్త సందేశాన్ని అందిస్తున్నాడు.

తనను శిలువ వేయబోయేముందు ఏసు క్రీస్తు పన్నెండు మంది శిష్యుల పాదాలను నీళ్లతో కడిగి, ముద్దాడాడని క్రైస్తవుల నమ్మకం. అందుకూ భగవంతుడు ఇచ్చిన సందేశం – "ఏ సేవకుడు కూడా యజమాని కంటే గొప్పవాడు కాదు; మీరంతా ప్రజలను యజమానులుగా చూడాలి, మీ సేవతో వారిని అలరించాలి". ఆనాటి నుంచి వాటికన్ నగరంలోని పోప్ లందరూ ఈ సాంప్రదాయాన్ని పాటిస్తున్నారు. ఈస్టర్ ముందు వచ్చే బేస్తవారం ఈ పవిత్ర ఆచారాన్ని పాటిస్తారు. కొత్త పోప్ ఈ సాంప్రదాయానికి నూతన భాష్యం చెప్పాడు. తాను కాళ్లు కడిగి, ముద్దాడ వలసిన పన్నెండు మందిలో ఇద్దరు మహిళలను, అందులోనూ ఒక ముస్లిం యువతిని ఎంపిక చేశారాయన. పైగా వీరంతా బాలనేరస్తుల జైలులో శిక్ష అనుభవిస్తున్న ఖైదీలు కావడం మరింత గొప్ప విశేషం. యావత్ క్రైస్తవ ప్రపంచంలో ఇదొక సంచలన సంఘటనగా మారింది ఇప్పుడు. తన చర్య ద్వారా కొత్త పోప్ మానవాళికి ఇవ్వదలచిన సందేశం – మనిషిని మనిషిగా ప్రేమించేతత్వం మానవాళిలో పెంపొందాలని. పోప్ ఫ్రాన్సిస్ చర్య సనాతన క్రైస్తవుల మనసులను కల్లోలపరుస్తున్నది. కానీ మతం అనేది మానవత్వ పరిమళాలు వెదజల్లేదిగా వుండాలని కోరుకొనే అభ్యుదయ వాదులందరూ ఈ చర్యను మనస్ఫూర్తిగా స్వాగతిస్తున్నారు.

జమీన్‌రైతు

మనుషులంతా ఒకటే అనే మహత్తర భావన పోప్ వంటి సర్వోన్నత మతాధిపతుల నుంచి వెలువడితే దాని ప్రభావం ఎంతో ప్రగాఢంగా వుంటుంది. మతం పేరుతో మానవత్వానికే మచ్చ తెచ్చే రీతిలో హింస కొనసాగుతున్న ప్రస్తుత ప్రపంచానికి ఇటువంటి సందేశాల అవసరం ఎంతైనా వుంది. మతం పేరుతో, జాతి పేరుతో, కులం పేరుతో, ప్రాంతం పేరుతో, అంతస్తుల పేరుతో మనుషులను విడదీసి చూసే హీన సంస్కృతిని మాన్పించి, మనుషులంతా ఒకటే అనే సందేశాన్ని ఇవ్వడం ద్వారా కొత్త పోప్ ఆదర్శప్రాయుడైనాడు. మనిషిని మనిషిగా ప్రేమించమనే ప్రభోదం ద్వారా మనసులలో చైతన్య దీపం వెలిగించాడు. అన్ని మతాల అధిపతులూ ఈ సందేశాన్ని గుర్తించి, గౌరవించవలసిన అవసరం వుంది.

వాటికన్ నగర నిర్వహణలో కూడా కొత్త పోప్ అనేక సంస్కరణలకు శ్రీకారం చుడుతున్నారు. మతాధిపతుల సాంప్రదాయాల ఉచ్చులో చిక్కుకొని సామాన్య జనానికి దూరమైపోవడం మానుకోవాలని తన నడవడిక ద్వారా బోధిస్తున్నాడాయన. ప్రపంచంలోని అత్యంత పేదలను, అభాగ్యులను, అనాధులను అక్కున చేర్చుకోమని ప్రభోదిస్తున్నాడు. రాజప్రసాదాల వంటి మత పీఠాల నుంచి బయటకు వచ్చి, హింస, పేదరికం, అజ్ఞానాలతో అలమటిస్తున్న అభాగ్యుల సేవకు పునరంకితం కమ్మని క్రైస్తవ మత పెద్దలందరికీ పిలుపు ఇచ్చాడాయన. తన మాటలను ఆచరించి చూపడం కోసం రాచరికపు చిహ్నాలను తలపించే లాంఛనాలను చాలా వాటిని త్యాగం చేస్తున్నాడాయన. దినచర్యలోని ఈ సంస్కరణ కూడా మతాధిపతులందరికీ ఒక ఆదర్శమని చెప్పక తప్పదు. మతాధిపతి అంటే మత విశ్వాసం కల్గిన వారిని సేవించే సేవకులే తప్ప మతానికి చక్రవర్తులు కారు, కాబోరు. అనాదిగా హిందూ మతాధిపతులు పాటించిన సూత్రం ఇది. కానీ ఇటీవలి కాలంలో మత ప్రచారకుల తీరు ఇందుకు అనుగుణంగా లేదు. చక్రవర్తుల శైలిలో జీవిస్తున్నారు వారు. విలాసాలకు లోబడి పోతున్నారు. దానితో సంపన్నులకు మాత్రమే సన్నిహితంగా మెలగుతున్నారు. సామాన్యులకు దూరమైపోతున్నారు.

పోప్ కోరుకొంటే దొరకని సుఖం ఈ భూమి మీద ఏదీ లేదు. అమెరికా అధ్యక్షుడి కంటే శక్తివంతమైన అధికార పీఠం అది. కానీ దాన్ని మానవ సేవకు ఒక ఉపకరణంగా మాత్రమే చూసే మానసిక పరిణితి కొత్త పోప్‌లో వ్యక్తం కావడం నిజంగా అభినందనీయం. మతం పేరుతో యావత్ అంతర్జాతీయ సమాజం చిన్నాభిన్నమై పోతున్న ఈ దురదృష్టకర పరిస్థితులలో పోప్ ఫ్రాన్సిస్ ఒక ఆశాకిరణం వలె కన్పిస్తున్నాడు. ఆయన ప్రయత్నానికి అందరి సహకారం లభించాలని ఆశిద్దాం.

## జనవాణి

### అర్బన్ బ్యాంకులో అబందర!

నేను నెల్లూరు గాంధీనగర్‌లోని కోఆపరేటివ్ అర్బన్ బ్యాంకులో ఖాతాదారుణ్ణి. నాకు అక్కడ లాకర్ సౌకర్యం కూడా ఉంది. సేఫ్ లాకర్లున్న గది అబందరగా, అభద్రంగా ఉన్న విషయం గత ఏడాదిగా బ్యాంక్ నిర్వహణాధికారి, డైరక్టర్ల దృష్టికి తెచ్చినా వాళ్లు ఎటువంటి చర్యలు తీసుకోలేదు. ఏదైనా నేరం జరిగితే కష్టమర్ల నష్టానికి ఎవరు బాధ్యత వహిస్తారు? పోలీసుశాఖ, సంబంధిత అధికారులు తక్షణం లాకర్ రూమ్‌కు పూర్తి భద్రత కల్పించేటట్లు ఆదేశించవలసిందిగా కోరుతున్నాను.

డాక్టర్ కాళిదాసు పురుషోత్తం — నెల్లూరు

### అనవసర హంగామా!

నెల్లూరు టౌన్‌లో పోలీసు, రెవెన్యూ ఇతర ప్రభుత్వ అధికారులు, రాజకీయ నాయకులు తిరిగే వాహనాలకు నెత్తిన బుగ్గలైటు, సైరన్‌లు ఉన్నాయి. వాటిని ఆ వాహనాలకు సంబంధించిన 'కస్టోడియన్'లు ప్రయాణించినప్పుడు మాత్రమే లైటు వేయడం, సైరన్ మ్రోగించడం జరగాలి. కాని పోలీసు వాహనాలలో డ్రైవర్లు తాము ఖాళీ బండిని తోలేటప్పుడు కూడా వాటిని మ్రోగిస్తూ రోడ్లలో హంగామా సృష్టిస్తున్నారు. బుగ్గ వాహన కస్టోడియన్‌లు ఈ విషయాన్ని పరిగణలోకి తీసుకొని తమ డ్రైవర్లను వారించడం బాగుంటుంది.

తూపిలి వనమాలి — నెల్లూరు

### రాజవోలు- ఎఎస్‌పేట రోడ్డుకు మోక్షమెప్పుడు?

రాజవోలు గ్రామం నుంచి ఎఎస్‌పేటకు గత 20 ఏళ్లుగా రోడ్డు వేస్తూనే ఉన్నారు. ఈ రోడ్డు నిర్మాణం పూర్తయితే ఎఎస్‌పేటకు రాజవోలుకు మధ్య దూరం కేవలం ఐదు కిలోమీటర్లు. ఇప్పుడైతే చుట్టూ తిరిగిరాను 25కిలో మీటర్లు పడుతుంది. ఆత్మకూరు నియోజకవర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్న ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఈ రోడ్డు నిర్మాణానికి నిధులు మంజూరు చేయమనవి.

ముంగమూరు వెంకటరెడ్డి — రాజవోలు

### హిందుత్వకు మతం లేదు!

ఈ నెలలో మహారాష్ట్ర ఆదాయపు పన్ను ట్రిబ్యునల్ ఒక సంచలన తీర్పునిచ్చింది. హిందుత్వకు మతం లేదు. శివుడు, హనుమాన్, దుర్గవంటి దేవతా మూర్తులు విశ్వం యొక్క అద్భుత శక్తులు వీరిని ఒకే మతానికి పరిమితం చేయలేమన్నారు. ఆలయాల నిర్వహణ ఖర్చును మతం కోసం చేసినవిగా పరిగణించలేమని స్పష్టం చేసింది. దేవస్థానాలు మతం ముసుగులో దాని పరిపాలకులు, అధికారులు ప్రభుత్వానికి చెల్లించాల్సిన పన్నును ఎగగొట్టలేవు. ఇది ఆహ్వానించ

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

9-4-1943
పేజీలు : 4 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

### బియ్యం ధర నిర్ణయించారు

మణువు 1కి రైలు జేర రూ. 8–1.0లు, ఉప్పు కాల్వారేవు జేర రూ. 8–3–0ల వంతున 6వ తేది ధర నిర్ణయించారు. మద్రాసుకు వెంటనే 3వేల టన్నులు పోవాలె. ఇందుకుగాను ఇప్పటికి వర్తకుల వద్ద నుండి రెండు వేల టన్నుల బియ్యం కొనుగోలు అయింది. వర్తకులు, మిల్లు ఓనర్లు యివ్వకపోతే రిక్విజేషను పద్ధతి క్రింద బలవంతంగా తీసుకొనే అధికారం ధాన్యం కొనుగోలు అధికారికుంది. అంతేగానీ రైతులు వద్ద నుండి బలవంతంగా తీసుకొనే అధికారం మాత్రం లేదు.

బియ్యం మణువుకు 1కి 35 శేర్లు అవుతవి. పద్ధతి ప్రకారం టవునులో రూ 1కి 4 1/2 శేరు అమ్మవలసి వుండగా 4 శేర్లు మాత్రమే అమ్ముతున్నారు. పాలిష్ ఇంతవరకు తగ్గించడం లేదు.

### బొమ్మా పెరోల్

బొమ్మా శేషురెడ్డి గారి తల్లికి జబ్బుగా వున్నందున 1వ తేది పెరోల్ మీదవచ్చి 7వ తేది వేలూరు జైలు అనే అత్తవారింటికి వెళ్లిరి. రెడ్డి 20 పౌనులు దాకా ఉబికారు.

### లక్ష్మయ్య పెరోల్

కుమారునికి స్ఫోటకం పోసి వున్నందున వేమూరి లక్ష్మయ్య గారిని రెండు వారాలు పెరోల్ మీద వదిలారు. 7వ తేది ఇచ్చటికి వచ్చారు. నెల్లూరు నుండి అడుగుదాటి కదలకూడదు.

–పర్యాలోచనము

## 50 ఏళ్ల క్రితం ఈవారం

5-4-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### న్యూయార్కు పత్రికల 114 రోజుల సమ్మె!

న్యూయార్కు నగరంలోని తొమ్మిది ప్రధాన దినపత్రికలలో 114 రోజులపాటు జరిగిన సమ్మె అంతమై, ఏప్రెల్ 4వ తేది ఆ పత్రికలు వెలువడినవి.

వార్తా పత్రికలకు ముఖం వాచిపోయి వుండిన న్యూయార్కు పౌరులు పత్రికలు వెలువడీ వెలువడగానే విరగబడి కొన్నారట.

న్యూయార్కు పత్రికలంటే స్వల్పమైన వ్యాప్తిగలవి కాదు. మన దేశంలోని పత్రికలన్నీ కలసి ఎన్ని అమ్ముడుపోతవో, న్యూయార్కు పత్రిక ఒక్కొక్కటి అంత అమ్ముడు పోతుంది. పత్రికల పుటలు గూడా పదులు, వందల సంఖ్యేగానీ మనవలె నాలుగు, ఆరు పేజీలు గాదు. సమ్మె తదనంతరం ఏప్రెల్ 1వ తేది 'డెయిలీ మిర్రర్' పత్రిక 40 పేజీలతోనూ, న్యూస్ అనే పత్రిక 64 పేజీలతోనూ వెలువడినవట. న్యూయార్కు టైమ్స్ పత్రిక మామూలు పత్రికకు, సమ్మె రోజులు వార్తానుబంధం 12 పేజీలతో జతచేసి యిచ్చిందట.

ఇక ఈ సమ్మెలో ఈ పత్రికలకు వాటి మీద ఆధారపడిన ఇతర రంగాలకు జరిగిన నష్టం చూస్తే మనకు ఆశ్చర్యం కలుగుతుంది. ఈ 9 పత్రికలు ప్రకటనల ద్వారాను, పత్రికల అమ్మకం ద్వారాను ఈ 114 రోజులలో 10 కోట్ల 80 లక్షల డాలర్లు(డాలరంటే షుమారు 5 రూపాయలు) నష్టపడినవట. ఇక న్యూస్ ప్రింటు ఉత్పత్తిదార్లు 1 కోటి 17 లక్షల డాలర్లు, వార్తాసంస్థలు 1 కోటి 17 లక్షల డాలర్లు; డిపార్టుమెంటు స్టోర్సు 65 లక్షల డాలర్లు; రెస్టారెంట్లు 1 కోటి 50 లక్షల డాలర్లు, మొత్తం కలుపుకుంటే 83 కోట్లు నష్టపోయాయి.

# నెల్లూరు ముచ్చట్లు

## సిఎం భజన చేసిన రామనారాయణ!

సోమశిల హైలెవల్ కెనాల్ ప్రారంభోత్సవ సభలో ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డిని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి మరీ తెగపొగడడం అందర్నీ ఆశ్చర్యపరిచింది. ఎందరో సిఎంలు రాష్ట్రాన్ని పరిపాలించారు. ఆత్మకూరు నియోజకవర్గ అభివృద్ధికి నాలుగు రూపాయలిచ్చిన వారు లేరు. కిరణ్‌కుమార్‌రెడ్డి ముఖ్యమంత్రి అయ్యాక ఆత్మకూరు సర్వతోముఖాభివృద్ధికి ఏం అడిగితే అది ఇచ్చారు. ఆత్మకూరు ప్రజలు ముఖ్యమంత్రికి రుణపడి ఉండాలనే పెద్ద పెద్ద ఉపమానాలు కూడా ఆనం రామనారాయణ రెడ్డి వాడడం విన్నవాళ్లు విస్తుపోయారు.

## ఇబ్బంది పడ్డ జనం!

ముఖ్యమంత్రి నెల్లూరు పర్యటన సందర్భంగా ఆయన పర్యటనను పెద్దగా పట్టించుకోని ప్రజలను ట్రాఫిక్ ఆంక్షల పేర ఎక్కడ పడితే అక్కడ ఎప్పుడు పడితే అప్పుడు ఆపి పోలీసులు మొత్తానికి కిరణ్ కుమార్‌రెడ్డిని తిట్టించారు. బందోబస్తు పేరిట పోలీసుల అతి జాగ్రత్తలు, అతి ప్రవర్తనలు వాళ్లను నెల్లూరు నగర వాసులు బూతులు తిట్టేలా చేసింది. అయినా పోలీసులు ఈ విషయమై పెద్దగా ఫీల్ కాలేదు.

## మూడు రోజులు కరెంట్ తీయలేదు!

1, 2, 3 తేదీల్లో నెల్లూరు నగరంలో విద్యుత్ కోత విధించలేదు. ముఖ్యమంత్రి పర్యటన పుణ్యమా అని ప్రజలకు కోతల వాతలు పెట్టకుండా ట్రాన్స్‌కో అధికారులు కరుణ చూపారు.

## వామ్మో ఎండలు!

మార్చి 31వ తేది నుంచి నెల్లూరులో భానుడు భగభగమండుతున్నాడు. బిర్రుగా కాస్తున్న ఎండకు తోడు గాలి బిగపడుతుండడంతో జనం ఉక్కిరి బిక్కిరవుతున్నారు. పర్యావరణ అసమతుల్యత వల్లే ఈ ఎండలు మండుతున్నాయి.

## రోశయ్య వచ్చి వెళ్లారు!

నెల్లూరోళ్లు పిలిస్తే చాలు ఉత్సాహంగా వచ్చేస్తారు తమిళనాడు గవర్నర్ రోశయ్య. 1వ తేది స్టోన్‌హౌస్‌పేటలోని ఆర్యవైశ్య భవన్ శంకుస్థాపన, అర్బన్ ఆర్యవైశ్య సంఘ ప్రమాణ స్వీకార కార్యక్రమాలకు వచ్చి వెళ్లారాయన.

## పనబాక కృష్ణయ్యకు అవమానం!

ముఖ్యమంత్రి సోమశిల పర్యటనలో పాల్గొన్న కేంద్ర మంత్రి పనబాక లక్ష్మి భర్త పనబాక కృష్ణయ్య అవమానాన్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. ప్రాజెక్ట్ దగ్గర బహిరంగ సభ ముగిశాక ముఖ్యమంత్రి ఇక్కడికి సమీపంలోని గిరిజన గురుకుల పాఠశాల విద్యార్థులతో మాటామంతీ కలపను వెళ్లారు. ముఖ్యమంత్రి కూర్చున్న సభావేదిక ప్రక్కన నిలబడి ఉన్న కృష్ణయ్య, చేవూరు దేవకుమార్ రెడ్డిలను ముఖ్యమంత్రి సెక్యూరిటీ బాధ్యతలు చూస్తున్న అధికారి అక్కడ నిలబడినందుకు తీవ్రంగా కసరి ప్రక్కకు వెళ్లండని త్రోసినంత పనిచేశాడు. ఆ అధికారిని తీవ్రంగా నసుగుతూ ఈ ఇద్దరు నాయకులు ప్రక్కకు తప్పుకోవడంతో అందరూ ఆ వైపు దృష్టి పెట్టారు.

## అల్లుడ్ని మీరు బాగా చూసుకోవాలి!

జిల్లాకు అల్లుడైన ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి నెల్లూరు అభివృద్ధిపై ఇంకాస్త దృష్టి పెట్టాలని ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి సోమశిల బహిరంగ సభలో ముఖ్యమంత్రిని కోరారు. నేను మీ జిల్లాకు అల్లుడిని. అల్లుడిని ఎవరు బాగా చూసుకోవాలి... మీరేగా అని చమత్కరిస్తూ మాట్లాడి సభికులు నవ్వుకునేలా చేశారు.

## చంద్రబాబును కిండల్ చేసిన సిఎం!

తెలుగులో ఉపన్యాసం చేయను నానా ఇబ్బందులు పడుతుండిన ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి నెల్లూరు ఇందిరమ్మ బాట కార్యక్రమంలో కాస్త మెరుగైన ఉపన్యాసాలు ఇవ్వడం చర్చనీయాంశమయ్యింది. సోమశిల బహిరంగ సభలో ప్రతిపక్ష నేత చంద్రబాబును కిండల్ చేస్తూ మాట్లాడారాయన. నడక మిత్రుడు... ఎవరు? అని ప్రజలను అడిగిన ఆయన ఎవరూ సమాధానం చెప్పక బోయే సరికి నడక మిత్రుడు చంద్రబాబన్నారు. ఆయన బిసిలు, మైనార్టీలు ఎస్సీలకు అధికారంలో ఉండగా ఏమీ చేయక ఇప్పుడు డిక్లరేషన్లు ప్రకటించడం ఏమిటన్నారు. ఎస్సీ, ఎస్టీ, బిసి, మైనార్టీల అభ్యున్నతికి నిఖార్సుగా కృషి చేసింది కాంగ్రెస్ ప్రభుత్వమేనని వివరంగా లెక్కలు చెప్పారాయన.

## భాగ్యనగరం నుంచి వ్రాతగాళ్లు!

ముఖ్యమంత్రి మూడు రోజుల జిల్లా పర్యటన కవరేజి నెల్లూరు జర్నలిస్టుల చేతకాదని కాబోలు కిరణ్‌కుమార్ రెడ్డి గారు హైదరాబాద్ నుంచి వోల్వో బస్సులో 30 మంది వ్రాతగాళ్లను తీసుకొచ్చారు. ఈ బస్సును మాత్రం కాన్వాయ్‌లో పోలీసులు అనుమతించారు. ఎప్పుడూలేంది ముఖ్యమంత్రి పర్యటనకు సమాచార కమిషనర్ దానం కిషోర్ కూడా రావడం చర్చకు తావిచ్చింది.




జమీన్‌రైతు

పొగతోట, నెల్లూరు - 524 001

ఫోన్: 0861 - 2327354

సెల్: 98489 66190


## పాత్రికేయులను పస్తు పెట్టారు!

ముఖ్యమంత్రి ఇందిరమ్మ బాటలో పాత్రికేయులు పస్తులుండి వార్తాసేకరణ చేయాల్సి వచ్చింది. సోమశిల పర్యటనలో గిరిజన బాలుర గురుకుల పాఠశాలలో 1వ తేది మధ్యాహ్నం ముఖ్యమంత్రి పిల్లలతో కలసి సహపంక్తి భోజనం చేశారు. పాత్రికేయులకు ఒక వరండాలో ఏర్పాటు చేసిన భోజనం దగ్గరకు బందోబస్తు పోలీసులొచ్చి పడిపోవడంతో గిన్నెలలో మెతుకు మిగలలేదు. మంచినీళ్లు అడిగిన పౌరసంబంధ శాఖాధికారిని ఓ పోలీసు నిర్ధాక్షిణ్యంగా నెట్టేశాడు. ముఖ్యమంత్రి పర్యటన పేరిట కోట్లు ఖర్చు పెట్టి ఉంటారు. కొండ ప్రాంతంలో ఈ కడుపు మాడ్చడమేంటి జిల్లా కలెక్టర్ గారు!

## మామ పని చూడని అల్లుడు!

జిల్లాలో మూడు రోజులపాటు ముఖ్యమంత్రి తెగ పర్యటించినా ఆయనకు పిల్లనిచ్చిన మామ కరవళ్ల వెంకట రమణారెడ్డి వదాన్యతతో అల్లూరులో రూపుదిద్దుకొన్న రుద్రభూమిని సిఎం ఓ గంటపాటు తీరిక చూసుకొని వెళ్లి చూసి రాలేదు. సిఎంను ఆయన మామ 3వ తేది కలసినా తాను చేసిన మంచి పని చూడమని అడగలేదు. అల్లుడు దీని గూర్చి ప్రస్తావించ లేదు. మొత్తానికి మామ అల్లుళ్లిద్దరూ తమ తమ బిర్రును బహు బాగుగా ప్రదర్శించారు.

## సోమశిల చెంత ఉప్పునీరు!

ఎప్పుడూ ఎంతో కొంత నీరు నిల్వ ఉండే ప్రాజెక్ట్‌గా సోమశిలకు పేరుంది. కానీ ఈ ప్రాజెక్ట్ ప్రక్కనే వున్న సోమశిల ఊరిలో ఉప్పు నీళ్లే ప్రజలు తాగడం, వాడడం కాస్త విస్తుగొల్పింది. ముఖ్యమంత్రి పర్యటనలో ఇక్కడ నీళ్లు తాగిన వారందరూ ఇదేందబ్బా ఈ నీళ్లని వ్యాఖ్యానించడం కనిపించింది.



పదవీ విరమణను పురస్కరించుకొని నెల్లూరు కార్పొరేషన్ కమిషనర్ డాక్టర్ టిఎస్ఆర్.ఆంజనేయులు దంపతులను సత్కరించి జ్ఞాపికను బహూకరిస్తున్న ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి. ప్రక్కన ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి, కార్పొరేషన్ డిప్యూటీ కమిషనర్ భాగ్యలక్ష్మి, ఇన్‌ఛార్జి కమిషనర్ సంపత్‌కుమార్.

## మాదాసుకు సముచిత స్థానం కల్పిస్తాం

సీనియర్ కాంగ్రెస్ నేత మాదాసు గంగాధరానికి పార్టీలో సముచిత స్థానం కల్పిస్తామని ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి తెలిపారు. జిల్లా పర్యటనలో భాగంగా ఆయన మొదటి రోజు ఏప్రెల్ 1న కలువాయి మండలంలో పర్యటించారు. బస్టాండ్ వద్ద జరిగిన సభలో ఆయన పైవిధంగా వ్యాఖ్యానించారు. ఉగాది నుంచి రేషన్ షాపుల్లో నిత్యావసర వస్తువుల కిట్‌ను 185 రూపాయలకు ఇస్తామని చెప్పారు.

## నెల్లూరులో ప్రెస్ అకాడమీ ఛైర్మన్!

రాష్ట్ర ప్రెస్ అకాడమీ ఛైర్మన్ టి.సురేంద్ర 3వ తేది నెల్లూరు వచ్చారు. ఇక్కడ ప్రెస్ అకాడమీ ఏర్పాటు చేసిన గ్రామీణ జర్నలిస్టుల శిక్షణా తరగతులను ఆయన ప్రారంభించారు. ముఖ్యమంత్రి పర్యటన మూలంగా శిక్షణా తరగతులకు హాజరయ్యే జర్నలిస్టుల సంఖ్య బాగా తగ్గింది.

## ఇందుకూరుపేటలోనూ కాపీయింగ్

ఇందుకూరుపేట మండలం పదవ తరగతి పరీక్షల్లో కాపీయింగ్ విచ్చలవిడిగా

కొరవ 14వ పేజీలో

# చిత్తశుద్ధితో పనిచేస్తా!

## అడిషనల్ జాయింట్ కలెక్టర్ ప్రకటన



జిల్లా అభివృద్ధికి చిత్తశుద్ధిగా కృషి చేస్తానని, జిల్లాపై తనకున్న అవగాహనను ఇందుకోసం ఉపయోగిస్తానని జిల్లా అడిషనల్ జాయింట్ కలెక్టర్‌గా నియమితుడైన చల్లా పెంచలరెడ్డి చెప్పారు. 28వ తేది సాయంత్రం బాధ్యతల స్వీకరణ అనంతరం విలేకరులతో మాట్లాడారు. జిల్లాలోని పలు మండలాల్లో తహశీల్దార్‌గా పనిచేశా. జడ్పీ సిఇఓగా వ్యవహరించిన అనుభవంతో తనకు జిల్లాపై పూర్తి అవగాహన ఉందన్నారు. జిల్లా కలెక్టర్ ఆధ్వర్యంలో ఇతర అధికారుల సహకారంతో జిల్లా అభివృద్ధికి కృషి చేస్తానన్నారు. 29వ తేది పెంచలరెడ్డి నగరపాలక సంస్థ ప్రత్యేకాధికారిగా బాధ్యతలు స్వీకరించారు. నెల్లూరు ఎమ్మార్వోగా పనిచేసిన అనుభవాన్ని నగర పాలక సంస్థ ప్రత్యేకాధికారిగా ఉపయోగించుకొంటానన్నారు. నగర ప్రజల సమస్యలను సాధ్యమైనంత మేర పరిష్కరించేందుకు కృషి చేస్తానన్నారు. బాధ్యతల స్వీకరణకు ముందు పెంచలరెడ్డి పెంచలకోనలోని పెనుశిల లక్ష్మీనృసింహస్వామిని దర్శించారు.

# రైతులకు రూ.250 కోట్ల రుణాలు!

## సెంట్రల్ బ్యాంకు అధ్యక్షుడు మెట్టుకూరు



జిల్లాలోని రైతులకు 250 కోట్ల రూపాయల మేర రుణాలు అందజేయనున్నట్లు సహకార బ్యాంక్ ఛైర్మన్ మెట్టుకూరు ధనుంజయరెడ్డి తెలిపారు. 28వ తేది జరిగిన సెంట్రల్ బ్యాంక్ పాలకవర్గ సమావేశం అనంతరం ఆయన తన ఛాంబర్‌లో ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో మాట్లాడారు. ఈ రుణాలను రైతులకు దీర్ఘకాలిక, స్వల్పకాలిక వాయిదా పద్ధతిన ఇవ్వనున్నట్లు చెప్పారు. రైతులకు తక్కువ సమయంలో ఎక్కువ లాభాలిచ్చే వ్యవసాయ రుణాలు, గొర్రెల వంటివి అధికసంఖ్యలో ఇవ్వనున్నట్లు వివరించారు. అలాగే బ్యాంక్‌లకు సంబంధించిన బకాయిలు ఎక్కువగా ఉన్నాయని, వాటి వసూళ్లకు ఇప్పటికే స్పెషల్ డ్రైవ్ ఏర్పాటు చేశామని, డిపాజిట్ల సేకరణపై కూడా ప్రత్యేక దృష్టి సారించినట్లు చెప్పారు. సహకార వ్యవస్థ చాలా మంచిదని పేర్కొన్న మెట్టుకూరు ఈ వ్యవస్థ ద్వారా రైతులకు చాలా మేలు చేయవచ్చునని, అయితే ఇదే స్థాయిలో రికవరీ కూడా వుండాలన్నారు. జిల్లాలో కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ శాఖలు 16 ఉన్నాయని, వీటిలో కొత్తగా అకౌంట్లు ఓపెన్ చేసేందుకు స్పెషల్ డ్రైవ్ చేస్తున్నామని, అకౌంట్లు పెరిగితే డిపాజిట్లు వాటంతట అవే వస్తాయన్నారు.

# వస్త్ర వ్యాపారుల బంద్ విరమణ!

20 రోజులుగా వస్త్ర వ్యాపారులు చేసిన బంద్‌ను 29వ తేది ముగించారు. ప్రభుత్వం వస్త్రాలపై వ్యాట్‌ను ఎత్తి వేసేందుకు సమ్మతించడంతో దుకాణ బంద్‌ను ఫెడరేషన్ ఆదేశానుసారం విరమింపజేసినట్లు క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ ఒక ప్రకటనలో తెలియజేసింది. రాష్ట్రవ్యాప్తంగా వస్త్ర దుకాణాల బంద్‌లో భాగంగా వ్యాపారులు పలు నిరసనలు, ప్రదర్శనలు చేసి ఎట్టకేలకు ముఖ్యమంత్రి వస్త్రాలపై వ్యాట్ తొలగించేందుకు సమ్మతించినట్లు ఫెడరేషన్ నాయకులు వెల్లడించడంతో బంద్‌ను విరమిస్తున్నట్లు ప్రకటించారు. ఈ మేరకు ఆచారివీధిలోని ది నెల్లూరు క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ హాల్‌లో సంఘం అధ్యక్షుడు నాగసూరి కామేశ్వరరావు నేతృత్వంలో సమావేశమైన వస్త్ర దుకాణాలు తెరవాలని తీర్మానించడంతో కాపువీధి, చిన్నబజారు, ట్రంకురోడ్డులోని దుకాణాలన్నీ తెరచుకొన్నాయి.

# రవీంద్రభారతి వారి ఇంటర్నేషనల్ స్కూల్!

## ● ఇతాకాను ప్రారంభించిన క్రికెటర్ లక్ష్మణ్

నెల్లూరు రమేష్‌రెడ్డినగర్‌లో రవీంద్రభారతి స్కూల్ స్థాపించి చక్కని విద్యాబోధనతో గుర్తింపు పొంది రాష్ట్రవ్యాపితంగా వంద బ్రాంచీలతో మహావృక్షమైన సంస్థ సరికొత్త ఇంటర్నేషనల్ స్కూల్ 'ఇతాకా' పేరిట పెట్టింది. ఈ స్కూల్‌ను 30వ తేది అనిల్ గార్డెన్స్‌లో ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన కార్యక్రమంలో ప్రముఖ క్రికెటర్ పద్మశ్రీ వి.వి.ఎస్.లక్ష్మణ్ లాంఛనంగా ప్రారంభించి మాట్లాడారు. సమాజంలో ఉపాధ్యాయులు, విద్యార్థుల మధ్య సంబంధం పవిత్రమైనదన్నారు. గురువు మార్గదర్శనం లేకుండా ఎవరూ అభివృద్ధి చెందలేరన్నారు. 1994లో నెల్లూరులో రవీంద్రభారతి స్కూల్ స్థాపించిన మణి రాష్ట్రంలో అప్రతిహతంగా ముందుకు సాగుతున్నారన్నారు. ఇతాకా కూడా నెల్లూరు కీర్తిప్రతిష్టలు పెంచుతుందన్నారు. ఈ కార్యక్రమంలో రవీంద్రభారతి స్కూల్ ఛైర్మన్ ఎం.ఎస్.మణి, ఎన్‌సిఆర్‌టి మాజీ డీన్ డాక్టర్ శ్రీవాత్సవ, బ్రిటీష్ కౌన్సిల్ పరీక్షల విభాగాధిపతి కేశవ్ శ్రీధరన్, వినాయక్ సుధాకర్, నెల్లూరు డీన్ శైలజ పాల్గొన్నారు.




ఇతాకాను ప్రారంభిస్తున్న క్రికెటర్ పద్మశ్రీ వి.వి.ఎస్.లక్ష్మణ్. ప్రక్కన రవీంద్రభారతి విద్యాసంస్థల ఛైర్మన్ ఎం.ఎస్.మణి తదితరులు.

# రమేష్‌రెడ్డి జరిపిన "లవకుశ" స్వర్ణోత్సవ సంబరం!

## ఆకర్షించిన కార్యక్రమం

తెలుగు చలన చిత్రసీమలో చారిత్రాత్మకంగా నిలిచిపోయిన లవకుశ చిత్రం విడుదలై 50 ఏళ్లు పూర్తిచేసుకున్న సందర్భంగా స్వర్ణోత్సవాలు నగరంలో ఎన్టీఆర్ అభిమాన సంఘం ఆధ్వర్యంలో ఘనంగా జరిగాయి. అఖిల భారత ఎన్టీఆర్ అభిమాన సంఘాల అధ్యక్షుడు, మాజీ మంత్రి తాళ్లపాక రమేష్‌రెడ్డి ఆధ్వర్యంలో నర్తకి సెంటర్‌లో బహిరంగ సభ నిర్వహించారు. ఈ సందర్భంగా రమేష్‌రెడ్డి మాట్లాడుతూ ఎన్టీఆర్‌తో, ఆయన కుటుంబంతో తనకు గల అనుబంధాన్ని గుర్తుచేసుకొని భావోద్వేగానికి లోనయ్యారు. రాముడిగా, కృష్ణుడిగా ఎన్నో సినిమాల్లో పాత్రలు పోషించి తెలుగు ప్రజల గుండెల్లో చిరస్థాయిగా నిలిచి పోయారన్నారు. 1982లో పార్టీ స్థాపించేనాడు విమానంలో తనను ఎక్కించుకొని పోయి చర్చించారన్నారు. ఆయన అభిమానిగా వున్న తనపై ఎంతో వాత్సల్యం చూపారన్నారు. సిఎన్ఎన్, ఐబిఎన్ ఇటీవల నిర్వహించిన మేటి నటుల సర్వేలో దేశంలోనే అత్యంత ప్రజాదరణ కల్గిన నటుడిగా నిలవడం ఎన్టీఆర్ ఒక్కడికే సాధ్యమన్నారు. ఆయన నటించిన లవకుశ సినిమా 1963లో శ్రీరాం థియేటర్‌లో విడుదలై ఘన విజయం సాధించిన విషయాన్ని గుర్తు చేశారు. టిడిపి పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి మాట్లాడుతూ తెలుగు ప్రజలు మరువలేని మహానటుడు ఎన్టీఆర్ అని ప్రశంసించారు. చలన చిత్రసీమలో మకుటంలేని మహారాజులా వెలుగొంది ఆ తర్వాత రాజకీయాలలోకి అడుగుపెట్టి అక్కడా చరిత్ర సృష్టించారన్నారు. ఎన్టీఆర్ అభిమానిగా రమేష్‌రెడ్డీ చరిత్ర సృష్టించారన్నారు. వివాహ సమయంలోనూ ఎన్టీఆర్ వచ్చేవరకు తాళి కట్టకుండా ఆయన వచ్చిన తర్వాతే పెళ్లి చేసుకొన్న సంగతిని ప్రస్తావించారు. రమేష్‌రెడ్డి, అనురాధలు మున్సిపల్ ఛైర్మన్‌లుగా విజయవంతంగా పనిచేసి ప్రజల మన్ననలు అందుకొన్నారన్నారు. ఏనాటికైనా మహానటుడు ఎన్టీఆరేనని స్పష్టం చేశారు. ఈ ఉత్సవాల సందర్భంగా రామారావు నటించిన వివిధ సినిమాల్లోని నిలువెత్తు ఫోటోలను వాహనాలపై వుంచి ర్యాలీ నిర్వహించారు. ఈ కార్యక్రమంలో టిడిపి నేతలు కిలారి వెంకటస్వామి నాయుడు, కోటంరెడ్డి శ్రీనివాసులు రెడ్డి తదితరులు పాల్గొన్నారు.



ఎన్టీఆర్ కటౌట్‌తో నగర వీధుల్లో ప్రదర్శన చేస్తున్న రమేష్‌రెడ్డి.

● టెన్త్ పరీక్షల్లో కాపీయింగ్‌పై

# మండిపడ్డ రాష్ట్ర పరిశీలకుడు!

## కలువాయిలో పరీక్షల నిర్వహణ పట్ల అసంతృప్తి

పబ్లిక్ పరీక్షలు జరిగే తీరు ఇదేనా? ఇవి పరీక్షలా ఇంకేమైనానా? ఈ జనాలేమిటి, గుట్టలు గుట్టలుగా చిట్టాలేమిటి అంటూ పదవ తరగతి పరీక్షల రాష్ట్ర పరిశీలకుడు సహదేవుడు ఆశ్చర్యం వ్యక్తం చేశారు. పరీక్షల్లో కాపీయింగ్‌పై వస్తున్న ఫిర్యాదులపై స్పందించిన ఆయన కలువాయి మండలంలో పర్యటించారు. ఈ పరీక్షా కేంద్రంలో గణితం పేపర్–1కు సంబంధించి విద్యార్థులు కాపీయింగ్‌కు పాల్పడుతూ, జవాబు పత్రాలను మార్చుకొంటుండడాన్ని గమనించి ఇద్దరు విద్యార్థులను మాల్‌ప్రాక్టీస్ క్రింద బుక్ చేశారు. ఇంత జరుగుతున్నా ఇన్విజిలేటర్లు చూసీచూడనట్లు వుండడంపై ఆగ్రహించిన ఆయన ఇన్విజిలేటర్లు వెంకటేశ్వర్లు, కృష్ణయ్యలను విధుల నుంచి తొలగించారు. పరీక్షల తీరుపై తీవ్ర అసంతృప్తిని వ్యక్తం చేసిన ఆయన మరోసారి ఇలా జరిగితే ఇన్విజిలేటర్లను సస్పెండ్ చేస్తానని హెచ్చరించారు. ఇంతగా కాపీయింగ్ జరుగుతుంటే మీరేం చేస్తున్నారంటూ పరీక్షాకేంద్రం చీఫ్ సూపరింటెండెంట్ వసుంధరాదేవి, డిపార్టుమెంట్ అధికారి భాస్కర్‌రెడ్డిలపై మండిపడ్డారు. వివరణ ఇవ్వడానికి ప్రయత్నించిన వారి మాటలకు మరింత ఆగ్రహించిన ఆయన ఎక్కువ మాట్లాడితే సస్పెండ్ చేయాల్సి వస్తుందని హెచ్చరించడంతో చీఫ్ సూపరింటెండెంట్ కన్నీళ్లు పెట్టుకొన్నారు. అలాగే బి–కేంద్రంలో విద్యార్థులను జబ్లింగ్ పద్ధతితో కాకుండా వరుసగా కూర్చోపెట్టి వుండడాన్ని గమనించి అక్కడి చీఫ్ సూపరింటెండెంట్ శ్రీనివాసులును నిలదీశారు. అధికారులు అలా కూర్చోబెట్టారని ఆయన సమాధానం ఇవ్వడంతో అక్కడ నుంచి డిఇఓ రామలింగానికి ఫోన్ చేసి ఈ కేంద్రంలోని విద్యార్థులను జబ్లింగ్ పద్ధతిలో కూర్చోపెట్టాలని ఆదేశించారు. పరిశీలకుడి రాకతో పదోతరగతి పరీక్షల్లో కాపీయింగ్ ఏ మేర జరుగుతుందో తెలిసివచ్చింది.

● ఎప్పుడు ఎన్నికలు జరిగినా

# వైకాపాదే విజయం!

## నేలటూరులో కాకాణి జోస్యం



రాష్ట్రంలో ఎప్పుడు ఎన్నికలు జరిగినా వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అధికారంలోకి రావడం ఖాయమని ఆ పార్టీ జిల్లా కన్వీనర్, సర్వేపల్లి నియోజకవర్గ సమన్వయకర్త కాకాణి గోవర్ధన్‌రెడ్డి జోస్యం చెప్పారు. సర్వేపల్లి నియోజకవర్గంలో చేపట్టిన ప్రజాదీవెన కార్యక్రమంలో భాగంగా ఆయన ముత్తుకూరు మండలంలోని నేలటూరు తదితర గ్రామాల్లో పర్యటించారు. ప్రజలనుద్దేశించి ఆయన మాట్లాడుతూ రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం అన్ని రంగాలలో ఘోర వైఫల్యం చెందిందన్నారు. ప్రజల సమస్యలు పట్టించుకోక పదవుల కోసం పాకులాటలోనే పాలకులు కాలం గడుపుతున్నారని విమర్శించారు. విద్యుత్ విషయంలో ప్రభుత్వం నిర్లక్ష్యం కారణంగానే ఈ పరిస్థితి తలెత్తిందన్నారు. ఆనాడు వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పేదలను దృష్టిలో పెట్టుకొని ఎన్నో సంక్షేమ పథకాలు అమలు చేస్తే ఈనాడు కాంగ్రెస్ ప్రభుత్వం వాటిన్నింటిని అటకెక్కించిందని, నిర్వీర్యం చేసిందని ఆరోపించారు. ప్రజల్లో బలం వున్న వైఎస్ జగన్‌ను రాజకీయంగా ఎదుర్కొనే శక్తిలేక కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు కుమ్మక్కై జైలు పాలు చేశారని విమర్శించారు. షర్మిళ చేస్తున్న పాదయాత్రలో జనం అధికసంఖ్యలో హాజరై తమ సంఘీభావం ప్రకటిస్తుండడం చూసి ఆ రెండు పార్టీలకు దడ పుడుతోందన్నారు. వచ్చే ఎన్నికల్లో సర్వేపల్లి నుంచి పోటీ చేయనున్నట్లు ప్రకటించారు. ఈ కార్యక్రమంలో మండల నాయకులు మెట్టా విష్ణువర్ధన్‌రెడ్డి, హరి, వేణు, రాజా తదితరులు పాల్గొన్నారు.

# వైభవంగా ప్రసన్నుడి బ్రహ్మోత్సవాలు

## పెద్ద సంఖ్యలో హాజరైన భక్తులు

కొండ బిట్రగుంటలో గల ప్రసన్న వెంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలు అంగరంగవైభవంగా జరిగాయి. మెట్లపూజతో మొదలైన ఈ ఉత్సవాలు తెప్పోత్సవంతో ముగిశాయి. కళ్యాణోత్సవానికి విశేష సంఖ్యలో భక్తులు హాజరయ్యారు. స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు దంపతులు కళ్యాణోత్సవానికి ముత్యాల తలంబ్రాలు తీసుకొని వచ్చి కార్యక్రమాన్ని ప్రారంభించారు. అర్చకులు వేద మంత్రోచ్ఛారణల మధ్య బిలకుట క్షేత్రంలో వెలసి వున్న ప్రసన్న వెంకటేశ్వరస్వామి కళ్యాణాన్ని శాస్త్రోక్తంగా నిర్వహించారు. కళ్యాణోత్సవం అనంతరం రథోత్సవం వైభవోపేతంగా జరిగింది. స్వామిని, అమ్మవారిని రకరకాల పూలతో అలంకరించి రథంపై కూర్చోపెట్టారు. ఈ రథోత్సవం పాత బిట్రగుంట, కొండ బిట్రగుంట వీధుల్లో భక్తులకు దర్శనమిచ్చారు. స్వామివారి తెప్పోత్సవం కన్నులపండువగా సాగింది. పూలతో, విద్యుత్ దీపాలతో అలంకరించిన తెప్పపై స్వామివారిని కోనేటిలో ఓలలాడించారు. ఈ ఉత్సవాన్ని వీక్షించేందుకు భక్తులు అధికసంఖ్యలో హాజరై గోవింద నామస్మరణ చేయడంతో బిలకోటక్షేత్రం గోవిందనామ స్మరణతో మారుమ్రోగింది. ఈ ఉత్సవాల్లో మాజీ శాసనసభ్యుడు కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి, దేవస్థానం మాజీ ఛైర్మన్ పిటి జగన్నాథం, ఆలయ ఇఓ ప్రభాకర్, ప్రధానార్చకులు కృష్ణమాచార్యులు, సిఐ ప్రసాద్, దేవరాల సుబ్రహ్మణ్యం తదితరులు పాల్గొన్నారు.

# వైకాపాలోకి మాజీ ఎమ్మెల్యే అనిల్?

కలువాయి మండలంలోని కాంగ్రెస్ నేతలు వలసబాట పట్టనున్నట్లు సమాచారం. కాంగ్రెస్ పార్టీ నుంచి వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీలోకి చేరేందుకు మండలంలోని కీలకనేతలు ప్రయత్నాలు సాగిస్తున్నట్లు సమాచారం. మాజీ ఎమ్మెల్యే అనిల్‌కుమార్‌రెడ్డి పార్టీ వైకాపా తీర్థం పుచ్చుకొనుండడంపై తీవ్ర చర్చ జరుగుతోంది. డాక్టర్ బి.గోపాల్‌రెడ్డి రాజకీయ వారసునిగా ఆరంగేట్రం చేసి మొదట కాంగ్రెస్ పార్టీలో, ఆ తర్వాత బొల్లినేని కృష్ణయ్యతో విభేదించి తెలుగుదేశం పార్టీలోకి వెళ్లారు. ఆ సమయంలో కలువాయి మండల ఎమ్మెల్యేగా ఎన్నికవ్వడమేగాక పంచాయితీ సర్పంచ్ పదవి తన వర్గానికే దక్కించుకొన్నాడు. మొన్నటి అసెంబ్లీ ఎన్నికలలో తిరిగి కాంగ్రెస్ పార్టీ తీర్థం పుచ్చుకొన్నాడు. ప్రస్తుతం నేదురుమల్లి వర్గీయుడిగా చలామణి అవుతున్న అనిల్ తాజాగా వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలోకి వెళ్లాలనుకొంటున్నట్లు సమాచారం. అభిమానులు, అనుచరుల నుంచి వస్తున్న ఒత్తిడి మేరకు త్వరలో జరిగే ఓ సమావేశంలో కాకాణి, కొమ్మి సమక్షంలో వైకాపాలో చేరుతారాయన.



నెల్లూరు ఆంధ్రజ్యోతి దిన పత్రిక స్టాఫ్ రిపోర్టర్ గయాజ్ కుమార్తె డాక్టర్ రూబియా, డాక్టర్ సయ్యద్ జమీర్ అహ్మద్‌ల నిఖా మార్చి 29వ తేది సిపిఆర్ కళ్యాణ మండపంలో జరిగింది.

# బోగోలులో తెలుగుదేశం కొవ్వొత్తుల ప్రదర్శన!

విద్యుత్ ఛార్జీల పెంపునకు నిరసనగా బోగోలు మండలంలో తెలుగుదేశం పార్టీ కొవ్వొత్తుల ర్యాలీ నిర్వహించింది. స్థానిక అంబేద్కర్ విగ్రహం నుండి బృందావనం, బజారుసెంటర్ వరకు ప్రదర్శన నిర్వహించి కాంగ్రెస్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు. ఈ సందర్భంగా తెలుగుదేశం పార్టీ మండల నేతలు మాట్లాడుతూ కాంగ్రెస్ ప్రభుత్వ తీరు వలన ప్రజలు ఆర్థికంగా చితికిపోతున్నారని, కుటుంబ పోషణ కష్టంగా మారిందన్నారు. రాష్ట్రప్రభుత్వ నిర్లక్ష్య ధోరణి వల్లే విద్యుత్ సంక్షోభం ఏర్పడిందన్నారు. సామాన్య, మధ్యతరగతి ప్రజలు విద్యుత్ ఛార్జీలు చెల్లించలేక ఇబ్బందులు పడుతున్నారన్నారు. సర్‌ఛార్జీలు, అదనపు ఛార్జీల పేరుతో జేబులు ఖాళీ చేస్తున్న ప్రభుత్వం మరోవైపు విద్యుత్ కోతలతో రైతులు, చిన్నపాటి పరిశ్రమల నిర్వాహకుల పరిస్థితి దుర్భరంగా మారిందన్నారు. ప్రజలు పెరిగిన ధరలతో సతమతం అవుతుంటే పాలకులకు పట్టకపోవడం విచారకరమన్నారు. తక్షణం పెంచిన విద్యుత్ ఛార్జీలను తగ్గించాలని డిమాండ్ చేశారు. లేదంటే ప్రజాఉద్యమాన్ని చేపడుతామని హెచ్చరించారు.



వైఎస్సార్ కాంగ్రెస్ నెల్లూరు రూరల్ అసెంబ్లీ నియోజకవర్గ కోఆర్డినేటర్‌గా నియమితుడై నెల్లూరు వచ్చిన కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డికి స్వాగతం పలుకుతున్న అభిమానులు.



ప్రఖ్యాత శాస్త్రవేత్త నాయుడమ్మ పేరిట నెల్లూరులోని నాయుడమ్మ సెంటర్ ఫర్ డెవలప్‌మెంట్ ఆల్టర్‌నేటివ్స్ సంస్థ ఇచ్చే స్మారక అవార్డును షార్ డైరెక్టర్ డాక్టర్ ఎంవైఎస్.ప్రసాద్‌కు అందిస్తున్న 'ఇగ్‌కార్' డైరెక్టర్ డాక్టర్ వాసుదేవరావు. ప్రక్కన కార్యక్రమ నిర్వాహకుడు డాక్టర్ జగదీష్.

# అయోడిన్ లోపంతో పలు ఆరోగ్యసమస్యలు!

● ఉదయగిరిలో డిఎంఅండ్‌హెచ్‌ఓ



పలు రకాల అనారోగ్య సమస్యలను దూరం చేసుకోవాలంటే ప్రతి ఒక్కరూ అయోడైజ్డ్ ఉప్పును ఉపయోగించాలని జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి డాక్టర్ మాసిలామణి సూచించారు. ఇటీవల ఆయన ఉదయగిరి నియోజకవర్గంలో పర్యటించి పలు ఆరోగ్య కేంద్రాలను ఆకస్మిక తనిఖీ జరిపారు. వైద్యులు, సిబ్బంది పనితీరును సమీక్షించిన ఆయన ఆస్పత్రులకు వచ్చే రోగులకు సరైన వైద్యసేవలు అందించాలన్నారు. అనంతరం విలేకరులతో మాట్లాడుతూ ఎక్కువ మంది అయోడిన్ లోపంతో బాధపడుతున్నారని తెలిపారు. ఇది లోపిస్తే థైరాయిడ్ సమస్యలు, గుండెజబ్బులు, చర్మవ్యాధులు, అధిక రక్తస్రావం, అబార్షన్లు, బుద్ధిమాంద్యం ఏర్పడడం, అంగవైకల్యం కల్గడం లాంటి ఆరోగ్య సమస్యలు తలెత్తుతాయన్నారు. ఈ రోగాలు రాకుండా వుండాలంటే చిన్నా పెద్దా అందరూ ప్రతిరోజూ అయోడైజ్డ్ ఉప్పును ఆహారంలో వినియోగించాలన్నారు. జిల్లాలోని వరికుంటపాడు, సూళ్లూరుపేట, నెల్లూరు, దుగరాజపట్నం, రాపూరు తదితర ప్రాంతాలలోని ప్రజలు అధికసంఖ్యలో అయోడిన్ లోపంతో బాధ పడుతున్నట్లు గుర్తించామన్నారు. దీనిపై ప్రజల్లో అవగాహన కల్పించేందుకు వైద్యఆరోగ్యశాఖ ఆదేశాలపై అయోడైజ్డ్ ఉప్పు, జింక్ మాత్రలు పంపిణీ చేయడంతోపాటు చైతన్య కార్యక్రమాలు రూపొందిస్తున్నామన్నారు.

# ట్రాన్స్‌ఫార్మర్ల చోరీలు!

## పొదలకూరు, మనుబోలు మండలాల్లో ముఠా?

జిల్లాలో ట్రాన్స్‌ఫార్మర్ల చోరీలు అధికం కావడంతో రైతులు హడలిపోతున్నారు. అర్ధరాత్రి వేళల్లో అదనుచూసి వీటిని తస్కరిస్తుండడంతో రోజురోజుకు ఇలాంటి కేసులు అధికమవుతున్నాయి. రైతులకు వీలుగా వుండేందుకు విద్యుత్‌శాఖ మినీ ట్రాన్స్‌ఫార్మర్‌లను ఏర్పాటు చేసింది. దీనిని అవకాశంగా చేసుకొన్న దొంగలు తమ హస్తలాఘవం ప్రదర్శించి ట్రాన్స్‌ఫార్మర్ల చోరీకి పాల్పడుతుండడంతో రైతులు ఆందోళన చెందుతున్నారు. తోటపల్లి గూడూరు, మనుబోలు, పొదలకూరు, మండలాల్లో ఈ దొంగతనాలు జోరందుకొన్నాయి. ఇటీవల కాలంలో పొదలకూరు మండలంలోని ప్రభగిరిపట్నం, ఉలవరపల్లి, తాటిపర్తి, వనంతోపు, కనుపర్తి, అమ్మవారిపాళెం, లింగంపల్లి, చిట్టిపల్లి, మహమ్మదాపురం, బత్తులపల్లి, పిజి పట్నం తదితర గ్రామాలలో ఈ దొంగతనాలు అధికం కావడంతో స్థానిక రైతులు పోలీసుస్టేషన్ల చుట్టూ తిరుగుతున్నారు. దొంగతనాలు అధికమైనా పోలీసులు తగిన రక్షణ చర్యలు చేపట్టడంలో విఫలమయ్యారనే విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. అసలే సాగునీటి కొరత, తెగుళ్ల కారణంగా పంటల సాగుకు అష్టకష్టాలు పడుతున్న రైతులకు ఈ ట్రాన్స్‌ఫార్మర్ దొంగతనాలు మరిన్ని చిక్కులు తెచ్చిపెడుతున్నాయి. ఇప్పటికైనా పోలీసులు గస్తీ ముమ్మరం చేసి ఇలాంటి దొంగతనాలకు పాల్పడే ముఠాలను పట్టుకోవాలని ఆయా గ్రామాల ప్రజలు కోరుకొంటున్నారు.

● షుగర్ ఫ్యాక్టరీకి

# తాళం వేసిన రైతులు!

## 23 కోట్ల రూపాయలు బకాయిపడ్డ యాజమాన్యం

నాయుడుపేట మండల పరిధిలోని అయ్యపరెడ్డిపాళెం సమీపంలో గల ఎంపి షుగర్ ఫ్యాక్టరీకి చెరుకు రైతులు తాళాలు వేశారు. దాదాపు 23కోట్ల రూపాయలు రైతులకు చెల్లించాల్సి వుంది. వీటి కోసం రైతులు చాలాకాలంగా యాజమాన్యానికి మొరపెట్టుకొంటున్నప్పటికి ఫలితం లేకపోవడంతో ఆగ్రహించిన రైతులు ఇటీవల ఫ్యాక్టరీకి తాళాలు వేసి ఆందోళనకు దిగారు. నాయుడుపేట, చిట్టమూరు, కోట, వాకాడు, పెళ్లకూరు, ఓజిలి మండలాకు చెందిన షుమారు 300 మంది చెరుకు రైతులు ఎంపి షుగర్ ఫ్యాక్టరీ వద్దకు చేరుకొని యాజమాన్యానికి వ్యతిరేకంగా ఆందోళన చేశారు. తాము కష్టపడి సాగు చేసిన చెరుకుతో చక్కెర తయారు చేసి కోట్ల రూపాయల ఆదాయం గడిస్తున్న యాజమాన్యం తమకు చెల్లించాల్సిన బకాయిల విషయంలో మాత్రం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోందని ఆగ్రహం వ్యక్తం చేశారు. తమకు రావాల్సిన బకాయిలు చెల్లించే వరకు చక్కెరను అమ్మకో నివ్వమని తెగేసి చెప్పిన రైతులు చక్కెర నిల్వలు వున్న గిడ్డంగికి తాళాలు వేశారు. ఫ్యాక్టరీ వద్ద ఉద్రిక్తత నెలకొనడంతో దిగి వచ్చిన యాజమాన్యం విడతల వారీగా బకాయిలు చెల్లిస్తామని చెప్పడంతో రైతులు తాత్కాలికంగా ఆందోళన విరమించారు.

# జాతరలా రిజిస్ట్రేషన్లు!

రాష్ట్ర ప్రభుత్వం ఏప్రెల్ 1 నుంచి భూముల రిజిస్ట్రేషన్ ఫీజులు పెంచిన సంగతి తెలిసిందే. దీంతో గతంలో భూములు, ఇంటి నివేశన స్థలాలు కొనుగోలు చేసిన వారు మార్చి నెలాఖరులో రిజిస్ట్రేషన్లు చేయించుకునేందుకు పోటీ పడ్డారు. జిల్లాలో రిజిస్ట్రేషన్ కార్యాలయంతోపాటు అన్ని సబ్ రిజిస్ట్రేషన్ కార్యాలయాల్లో ఈ తతంగం జరిగి పోయింది. మార్చి నెల దాటితే రిజిస్ట్రేషన్ కోసం అధిక ఫీజులు చెల్లించాల్సి వుండడం వలన దళారులను ఆశ్రయించి రిజిస్ట్రేషన్ కార్యక్రమాన్ని పూర్తి చేయించుకోగలిగారు. దీనిని అవకాశంగా తీసుకున్న స్టాంప్ పేపర్ల విక్రయించే వెండర్లు, డాక్యుమెంటు రైటర్లు కార్యాలయానికి వచ్చే వారి నుంచి భారీగానే ఫీజుల రూపంలో నగదు వసూలు చేసుకున్నారు. కొన్ని సబ్ రిజిస్ట్రార్ కార్యాలయాల్లో సెలవు దినాల్లో పనిచేసి ముందు రోజు తేదీలతో రిజిస్ట్రేషన్లు చేశారు. ఈ నేపథ్యంలోనే సూళ్లూరుపేట సబ్ రిజిస్ట్రార్ కార్యాలయంపై ఏసిబి దాడి చేసింది.

● కావలి, ఉదయగిరిల్లో

# విషజ్వరాలు!

## నానా పాట్లు పడుతున్న జనం

కావలి, ఉదయగిరి నియోజకవర్గాలలో విషజ్వరాలు ప్రబలుతున్నాయి. పారిశుధ్య పరిస్థితులు క్షీణించడం, దోమల వ్యాప్తితో పలుగ్రామాల ప్రజలు విషజ్వరాల బారినపడి ఆస్పత్రుల పాలవుతున్నారు. వివిధ మండలాల పరిధిలో అధిక సంఖ్యాకులు జ్వరపీడితులుగా మారారు. ప్రభుత్వ ఆస్పత్రులకు వెళ్తే సరైన వైద్య చికిత్స అందించే వారే లేకుండా పోవడంతో ఖర్చు అయినా ప్రైవేట్ ఆస్పత్రులకు వెళ్లి చికిత్స పొందుతున్నారు రోగగ్రస్తులు. కావలి పట్టణ పరిధితోపాటు, రూరల్ బోగోలు మండలాలతోపాటు ఉదయగిరి నియోజకవర్గ పరిధిలోని జలదంకి, కమ్మపాళెం, బ్రహ్మణక్రాక తదితర గ్రామాల్లోని ప్రజలు విషజ్వరాలతో మంచం పట్టారు. కావలి ఏరియా వైద్యశాలకు వచ్చి రోగులకు విషజ్వరాల పరీక్షలు జరిగేందుకు తగిన ల్యాబ్ టెక్నిషియన్లు లేకపోవడంతో వ్యాధినిర్ధారణ పరీక్షలు జరపడం లేదు. మలేరియా జ్వరాలా? ఇతర జ్వరాలో తెలిపే పరీక్షలు చేసేవారు లేక పోవడంతో విషజ్వరాల బారినపడిన ప్రజలు ప్రభుత్వ ఆస్పత్రులు వదలి ప్రైవేట్ ఆస్పత్రులను ఆశ్రయించాల్సి వస్తోంది.



# తెలుగుదేశం, కాంగ్రెస్ కుమ్మక్కయ్యాయి!

## సూళ్లూరుపేటలో నెలవల విమర్శ



అధికార కాంగ్రెస్‌పార్టీ, ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీలు చేస్తున్న కుమ్మక్కు రాజకీయాలను ప్రజలు అసహ్యించుకొంటున్నారని సూళ్లూరుపేట మాజీ శాసనసభ్యుడు, వైకాపా నేత నెలవల సుబ్రహ్మణ్యం విమర్శించారు. ఇటీవల శాసనసభలో ప్రభుత్వంపై అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టినపుడు తెలుగుదేశంపార్టీ దానికి దూరంగా వుండడంతో రాష్ట్ర ప్రజలకు వీరి మధ్య నడుస్తున్న కుమ్మక్కు రాజకీయాలు అర్థమయ్యాయన్నారు. కాంగ్రెస్ ప్రభుత్వం రాష్ట్రాన్ని అన్నిరకాలుగా అస్తవ్యస్తం చేసిందన్నారు. నిత్యావసర వస్తువుల ధరలు పెరిగి, కరెంటు ఛార్జీలు పెరిగి ఆర్థిక భారం మోయలేక ప్రజలు ఇబ్బంది పడుతుంటే ప్రభుత్వానికి చీమకుట్టినట్లయినా లేదన్నారు. రైతులు పంటలు పండించుకోలేక, విద్యుత్ కోతలతో, పెరిగిన ఛార్జీలతో, గిట్టుబాటు ధర లేక సతమతమం అవుతున్నారన్నారు. విద్యార్థుల పరిస్థితి దారుణంగా వుందన్నారు. ఉపకార వేతనాలు అందక చదువుకొనేందుకు ఇబ్బందులుపడుతున్నారన్నారు. ఇంతగా ప్రజలు వివిధ సమస్యలతో అల్లాడుతుంటే ప్రభుత్వం వాటిని పరిష్కరించాల్సిందిపోయి ప్రభుత్వాన్ని కాపాడుకోవడానికి పదవులు నిలుపు కోవడానికే ప్రాధాన్యమిస్తున్నారన్నారు. ఈ రెండు పార్టీలకు ప్రజలు తగిన బుద్ధి చెప్పే రోజులు దగ్గర్లోనే వున్నాయన్నారు.

# విద్యుత్ సర్‌ఛార్జీలను ప్రభుత్వమే భరించాలి!

## తెలుగుదేశం రాష్ట్ర కార్యదర్శి చేజర్ల వెంకటేశ్వరరెడ్డి డిమాండ్

రాష్ట్ర ప్రభుత్వం విద్యుత్ ఛార్జీల పెంపును ఉపసంహరించుకోవాలని, సర్‌ఛార్జీలను ప్రభుత్వమే భరించాలని తెలుగుదేశం పార్టీ డిమాండ్ చేసింది. హైదరాబాద్‌లో తెలుగుదేశం పార్టీ నేతలు కరెంటు ఛార్జీల పెంపును నిరసిస్తూ చేపట్టిన నిరాహార దీక్షలకు మద్దత్తుగా ఆందోళన కార్యక్రమాన్ని కోవూరులోని గుమళ్లదిబ్బలో చేపట్టారు. ఈ సందర్భంగా టిడిపి రాష్ట్ర కార్యదర్శి చేజర్ల వెంకటేశ్వర్లురెడ్డి మాట్లాడుతూ గతంలో విద్యుత్ వైర్లు తాకితే షాక్ కొట్టేదని, కాని నేడు కాంగ్రెస్ ప్రభుత్వ పాలనలో కరెంటు బిల్లులు తాకితేనే షాక్ కొడుతున్నాయని విమర్శించారు. విద్యుత్ రంగాన్ని గాడిలో పెట్టడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలమైందన్నారు. పల్లెల్లో చీకటి రాజ్యం ఏలుతోందని, ఎప్పుడు కరెంటు వస్తుందో, ఎప్పుడు పోతుందో తెలియడం లేదన్నారు. కరెంటు కోతలు, పెరిగిన ఛార్జీలతో రాష్ట్ర ప్రజలు సతమతం అవుతున్నారన్నారు. వ్యవసాయానికి నిరంతరాయంగా ఏడు గంటలు విద్యుత్ ఇవ్వాలని, గ్రామాల్లో విద్యుత్ కోత ఎత్తివేయాలని, పెరిగిన ఛార్జీలను ప్రభుత్వమే భరించాలని డిమాండ్ చేశారు. ప్రభుత్వం ఈ డిమాండ్లకు తలొగ్గకపోతే ఉద్యమాన్ని ఉధృతం చేస్తామని హెచ్చరించారు. అనంతరం ప్రభుత్వ తీరుకు నిరసనగా కరెంటు బిల్లులను తగులబెట్టారు.



తెలుగుదేశం పార్టీ పొలిట్ బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి జన్మదినోత్సవాన్ని నెల్లూరు తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో జరుపుతున్న ఆ పార్టీ నాయకులు, కార్యకర్తలు.

# ప్రతాప్‌కుమార్‌రెడ్డి నియామకం పట్ల హర్షం!

## కావలి వైకాపాలో గ్రూపులు లేవు.



వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ కావలి నియోజకవర్గ సమన్వయకర్తగా రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డిని ఖరారు చేశారు. నియోజకవర్గ ఇన్‌ఛార్జీగా బాధ్యతలు నిర్వహిస్తుండిన ప్రతాప్ పార్టీ కార్యక్రమాలను ప్రజల్లోకి తీసుకెళ్లడంలో చురుకైన పాత్ర పోషిస్తున్నారు. ఈ సమయంలో నియోజకవర్గ సమన్వయకర్తగా పలువురు పోటీలో వున్నారన్న ప్రచారం జరగడంతో కార్యకర్తలు కొంత అయోమయానికి లోనయ్యారు. ఈ పరిస్థితుల్లో సమన్వయకర్తగా ప్రతాప్‌కుమార్‌రెడ్డి పేరును ప్రకటించడంతోపాటు నియామక పత్రాన్ని ఆ పార్టీ గౌరవాధ్యక్షురాలు విజయమ్మ చేతులమీదుగా ప్రతాప్ అందుకోవడంతో ఈ ప్రచారానికి తెరపడింది. ఈ సందర్భంగా కావలి పట్టణంతోపాటు రూరల్ మండలం, బోగోలు తదితర మండలాల్లో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ కార్యకర్తలు, నేతలు హర్షం వ్యక్తం చేశారు. ఆపార్టీ మండల కన్వీనర్లు చింతం బాబురెడ్డి, షాహుల్ హమీద్, తిరువీధి ప్రసాద్, నవాజ్‌ఖాన్, మాల్యాద్రి తదితరులు మాట్లాడుతూ ప్రతాప్‌కుమార్‌రెడ్డిని హైకమాండ్ పార్టీ సమన్వయకర్తగా నియమించడం పట్ల వైఎస్ విజయమ్మకు, ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, కాకాణి గోవర్ధన్‌రెడ్డిలకు కృతజ్ఞతలు తెలిపారు. వైఎస్ఆర్ సాధన కోసం కృషి చేస్తున్న వైఎస్ జగన్ బాటలో అందరూ నడవాలని, ప్రతాప్‌ను అసెంబ్లీ ఎన్నికలలో గెలిపించాలని కార్యకర్తలకు పిలుపునిచ్చారు. అనంతరం మిఠాయిలు పంచి పెట్టారు.

● వెంకటగిరి

# మంచినీటి పథకాలకు నిధులు!

## ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ ప్రకటన



వెంకటగిరి నియోజకవర్గ పరిధిలో మినీ మంచినీటి పథకాలకు కోటి 63లక్షల రూపాయల నిధులు మంజూరైనట్లు స్థానిక శాసన సభ్యుడు కురుగుండ్ల రామకృష్ణ తెలిపారు. స్థానికంగా ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ నియోజకవర్గంలోని వివిధ గ్రామాలలో 33 మినీ మంచినీటి పథకాలను ఏర్పాటు చేస్తున్నామన్నారు. వెంకటగిరి మండలంలోని బ్యాండ్‌పాళెంలో 4 లక్షల రూపాయలతో, చిన్నన్నపేటలో 7లక్షలు, కుర్జాగుంటలో 4లక్షలు, పూలరంగడిపల్లిలో 4లక్షలు, వల్లివేడులో 4లక్షలు, ఉప్పరపల్లిలో 1.25లక్షలు, లింగమనాయుడుపల్లిలో 4లక్షలు వెచ్చించి ఈ పథకాలను ఏర్పాటు చేస్తున్నామన్నారు. అలాగే యాచసముద్రం, యాతలూరు, కలువాయి మండలంలోని బాలాజీరావుపేట, చీపినాపి, కుల్లూరు, రాపూరు మండలం గోనుపల్లి, రాపూరు, డక్కిలి మండలం ఆల్తూరుపాడు, దగ్గవోలు, కొత్తనాలపాడు, కమ్మవారిపల్లి, బాలాయపల్లి మండలలోని అలిమిలి, పిగిలాం, నిండలి తదితర గ్రామాలలో నాలుగేసి లక్షల రూపాయలు మినీనీటి పథకాలకు మంజూరయ్యాయన్నారు. ఈ నిధులను మంజూరు చేసిన రాష్ట్ర పంచాయితీ రాజ్‌శాఖ మంత్రి జానారెడ్డికి ఆయన కృతజ్ఞతలు తెలిపారు.

# పేదల ఆరోగ్యం కోసం 70వేల కోట్లు!

## తిరుపతి ఎమ్పీ చింతామోహన్ ప్రకటన



పేదల వైద్యం కోసం కేంద్ర ప్రభుత్వం 70వేల కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నట్లు తిరుపతి ఎమ్పీ చింతామోహన్ తెలిపారు. ఇటీవల ఆయన బాలాయపల్లి మండలంలో పర్యటించారు. స్థానిక మండల పరిషత్ కార్యాలయంలో వివిధ పథకాల అమలుపై ఆయా శాఖల అధికారులతో సమీక్షించారు. ప్రభుత్వ పథకాలు పేదలు, అర్హులకు సక్రమంగా అందేలా చూడాలన్నారు. మండలంలోని స్వయం సహాయక సంఘాలకు చెరువులో చేపలు పట్టుకొనే హక్కు కల్పించాలని ఎంపిడిఓను ఆదేశించారు. గర్భిణులకు ప్రతిరోజు కోడిగుడ్డు అందించే విధంగా అవసరమైన నిధులు కేంద్రం నుంచి తీసుకవస్తామని హామీ ఇచ్చారు. అలాగే తడలో ఒక విశ్వ విద్యాలయాన్ని ఏర్పాటు చేసేందుకు కృషి చేస్తామన్నారు. అనంతరం ఆయన వెంకటగిరి మండలంలో పర్యటించారు. అక్కడ అధికారులతో సమావేశమైన చింతామోహన్ పథకాల అమలుపై క్షుణ్ణంగా సమీక్ష జరిపారు. స్థానిక ప్రభుత్వ ఆస్పత్రిలో రోగులకు అందుతున్న వైద్య సేవలపై అసంతృప్తి వ్యక్తం చేశారు. వైద్యులు, సిబ్బంది తమ పని తీరు మార్చుకోవాలని సూచించారు. ఆస్పత్రికి అవసరమైన ఎక్స్‌రే ప్లాంటు ఏర్పాటు చేయిస్తామని హామీ ఇచ్చారు. వేసవి కాలంలో మంచినీటి సమస్య తలెత్తకుండా తగిన ముందస్తు చర్యలు తీసుకోవాలని ఆర్‌డబ్ల్యుఎస్ అధికారులను ఆదేశించారు.

జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001.
ప్రకటనలకు
98489 66163
98489 66165
చందాలకు
98489 66190

## చేజర్ల స్వర్ణోత్సవాలకు తొలగిన అడ్డంకి!

రాజకీయ కారణాలతో వెనక్కుపోతుండిన చేజర్ల ఉన్నతపాఠశాల స్వర్ణోత్సవాలకు ఎట్టకేలకు ముహూర్తం ఖరారయ్యింది. ఏప్రెల్ 13, 14 తేదీలలో ఈ ఉత్సవాలను నిర్వహించేందుకు పూర్వ విద్యార్థులు అన్ని ఏర్పాటు చేస్తున్నారు. ఈ పాఠశాల స్థాపించి 50 ఏళ్లు పూర్తయిన సందర్భంగా పాఠశాల స్వర్ణోత్సవ వేడుకలకు గత ఏడాది శ్రీకారం చుట్టారు. అయితే వీటికి రాజకీయాలు అడ్డుతగిలాయి. ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి వస్తే తాను హాజరుకానంటూ మాజీ ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడు తెగేసి చెప్పడంతో ఈ కార్యక్రమం తాత్కాలికంగా వాయిదా పడింది. స్వర్ణోత్సవాల విషయం తెలియగానే పూర్వ విద్యార్థులు కోరికపై మంత్రి ఆనం పాఠశాలకు ప్రహరీగోడ నిర్మాణానికి, మంచినీటి సౌకర్యానికి నిధులు మంజూరు చేయించారు. ఈ పరిస్థితుల్లో ఈ వేడుకలను తిరిగి నిర్వహించేందుకు పూర్వ విద్యార్థులు నడుంబిగించారు. 13,14 తేదీలను ఖరారు చేసి కార్యక్రమానికి ఆహ్వానిస్తున్నారు. ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ఎంపి రాజమోహన్‌రెడ్డి, శాసన మండలి సభ్యులు వాకాటి నారాయణరెడ్డి, విలపు బాలసుబ్రహ్మణ్యం, వై శ్రీనివాసులురెడ్డి, జిల్లా కలెక్టర్, ఎస్పీలు హాజరవుతారు.

## తెలుగువారి తొలి పండుగ

# 'ఉగాది'

తెలుగువారు జరుపుకొనే పండుగలలో ముఖ్యమైనది ఉగాది. ఉగ అనగా నక్షత్ర గమనం. ఆ నక్షత్ర గమనానికి ఆది ఉగాది. అనగా సృష్టి ఉగాది. యుగం అంటే ద్వయము, జంట అనే అర్థాలు వున్నాయి. ఉత్తరాయణం, దక్షిణాయనం అనబడే అయన ద్వయ సంయుతం యుగం (సంవత్సరం) కాగా, ఆ యుగానికి ఆది యుగాది అయ్యింది. ప్రతి సంవత్సరం చైత్ర మాసంలో వచ్చే పాడ్యమినాడు ఉగాది పండుగను జరుపుకోవడం ఆనవాయితీ. ఆరోజు నుంచే తెలుగు సంవత్సరం మొదలవుతుంది కాబట్టి ఉగాది తెలుగువారి మొదటి పండుగ అయ్యింది. పండుగ నాడు తలంటి స్నానం చేసి, కొత్త బట్టలు ధరించి ఉగాది పచ్చడితో దినచర్య ప్రారంభిస్తారు. ఆలయానికి వెళ్లి దైవ దర్శనం చేసుకొని, కొత్త సంవత్సరంలో రాశి ఫలాలు, గ్రహ స్థితులు ఎలా వున్నాయో తెలుసుకొనేందుకు పంచాగ శ్రవణం చేస్తారు.

చైత్ర శుక్ల పాడ్యమినాడు విశాల విశ్వాన్ని బ్రహ్మదేవుడు సృష్టించాడు. దేవతల్ని ఆయా పనులకు వినియోగించాడు. సృష్టిని ఆరంభించినందుకు సంకేతంగా ఇది సంవత్సరాది అయ్యిందని, ఉగాదిగా జరుపుకొనబడుచున్నాదని బ్రహ్మాండ పురాణం తెలియజేస్తోంది. ఈ పండుగకు సంబంధించి మరొక పురాణగాథ ఒకటి ప్రచారంలో వుంది. వేదాలను సోమకుడు అనే రాక్షసుడు అపహరించుకొని వెళ్లిన సమయంలో అతన్ని వధించి వేదాలను తెచ్చేందుకు విష్ణుమూర్తి మత్స్యరూపాన్ని ధరించి వాటిని తిరిగి బ్రహ్మకు అప్పగించిన రోజు కాబట్టి విష్ణు ప్రీత్యర్థం ఉగాది పండుగ ప్రశస్తిలోకి వచ్చిందని పురాణాలు చెబుతున్నాయి. అలాగే శాలివాహన చక్రవర్తి చైత్రశుక్ల పాడ్యమి నాడే పట్టాభిషక్తుడై తన శౌర్య పరాక్రమాలతో శాలివాహనయుగ కర్తగా పేరు తెచ్చుకొన్నందున ఆనాడు ఉగాదిగా జరుపుకొంటున్నారని మరొక కథనం. వనవాసం వెళ్లిన శ్రీరాముడు సీత, లక్ష్మణ సమేతంగా తిరిగి అయోధ్యకు తిరుగు ప్రయాణం ఆరంభించింది ఉగాది నాడేనని రామాయణం చెబుతోంది. ఉగాదినాడు చేసే పూజలలో బ్రహ్మను అర్చించాలని, ఈ పూజ దమనంతో చేయాలని స్మృతి కౌస్తుభం, పురషార్థచింతామణిలో వివరించబడింది. అలాగే హేమాద్రి వ్రత ఖండంలోనూ దీని వివరణ వుంది. ఉగాది పండుగ నాడు ఉగాది పచ్చడి తినడం అనాదిగా వస్తున్న ఆచారం. వేపపువ్వు, కొత్త చింతపండు, బెల్లం, మామిడి కాయలతో తయారు చేసేదానినే ఉగాది పచ్చడి అంటారు. పలు రుచుల మేళవింపు అయిన పచ్చడి తినడం వల్ల చేదు వెనుక తీపి, పులుపు వెనుక కారం ఇలా జీవన కష్టాలను ఇది ప్రతిబింబిస్తుంది. అంతే కాకుండా ఆయుర్వేదపరంగా శరీరానికి మంచిది. పంచాగం శ్రవణం మరొక ఆచారం. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములనే పంచాగముల సమన్వితం పంచాంగం. రాశిఫలాలు, గ్రహస్థితులు వీటి ద్వారా తెలుస్తాయి. ఎన్నో ప్రత్యేకతలకు నెలవైన ఉగాది జగత్తులో చైతన్యాన్ని రగిలించి మానవాళిలో నూతనాశయాలను అంకురింపజేసే శుభదినంగా చెప్పబడింది.

# జన్మభూమి రుణం తీర్చుకొన్న ఆర్‌ఆర్ రమణారెడ్డి!



ఆర్‌ఆర్ రమణారెడ్డి అల్లూరులో నిర్మించిన రుద్రభూమిలో దహన వాటిక.

ఆర్‌ఆర్ గ్రూప్ హోటళ్ల అధినేత కరవళ్ల వెంకటరమణారెడ్డి 60 లక్షల రూపాయల ఖర్చుతో అల్లూరులో ఒక రుద్ర భూమి నిర్మించాడు. దీన్ని 7తేది జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి, ఎస్పీ బివి.రమణకుమార్ చేతుల మీదుగా అల్లూరీయులకు అంకితమిస్తున్నాడు. అల్లూరు సంపన్న గ్రామం. భాగ్యవంతుల నిలయం. అక్కడ నుంచి వెళ్లిన వారిలో సుప్రీంకోర్టు జడ్జీలున్నారు; ప్రముఖ పారిశ్రామికవేత్తలున్నారు; ఫైవ్‌స్టార్ హోటళ్ల అధినేతలున్నారు; వివిధ రంగాలలో రాణించిన ప్రముఖులున్నారు. కానీ వూరి స్మశానం మాత్రం పాడు పడిపోయింది. మనిషన్నవాడు చివరకు చేరవలసింది అక్కడకే. తన అంతిమ సంస్కారం ప్రశాంతంగా జరగాలని ప్రతి ఒక్కరూ కోరుకొంటారు. బంధువులు, కుటుంబ సభ్యులకు కూడా అదే కోరిక. ఆఖరి మజిలీ అపరిశుభ్రంగా, అస్తవ్యస్థంగా వుంటే అందరి మనసులకూ బాధే. అల్లూరు గ్రామానికే చెందిన రమణారెడ్డికి కూడా ఆ అసంతృప్తి కలిగినట్లుంది. తన జన్మభూమి రుణం తీర్చుకోవడానికి ఇదొక సత్కార్యంగా భావించి, స్మశాన సంస్కారం చేపట్టాడాయన. రెండెకరాల స్థలంలో ఆక్రమణలు తొలగించి, ప్రహరీ కట్టించి, ఆహ్లాదకర వాతావరణం సృష్టించి, ఆధునికమైన దహన శాలలు, స్నాన గదులు, అంత్యక్రియల వేదికలు నిర్మించి వూరి మెప్పు పొందాడు. కైవల్యం ప్రాప్తింప చేసే మహా శివుడి విగ్రహాన్ని ప్రతిష్టింప చేశాడు. చరిత్రలో స్థిరస్థానం సంపాదించిన కాటికాపరి సత్యహరిశ్చంద్రుడి బొమ్మనూ నిలబెట్టాడు. మొత్తం మీద అదొక స్మశానంగా కాక, ఆహ్లాదకరమైన విహార స్థలం వలె తీర్చి దిద్దాడు.

హోటళ్ల రంగంలో రమణారెడ్డి పేరు తెలియనివారు లేరు. ఆయన ఆర్‌ఆర్ హోటల్‌లో ఒకసారి తింటే ఆ రుచి జన్మంతా జ్ఞాపకం పెట్టుకొంటారు భోజన ప్రియులు. నెల్లూరు వంటల ఘుమఘుమలను అమెరికా, అరేబియా దేశాలకు వ్యాపింపచేసిన సమర్ధుడు. ఎన్నో ఏళ్లక్రితం అల్లూరు వదలి వెళ్లిపోయాడాయన. కానీ పుట్టిన వూరి మీద మమకారం మాత్రం తరగలేదు. దాని ఫలితమే ఈ సత్కార్యం. నిస్వార్ధంగా చేసిన మంచి పని ఇది. రమణారెడ్డిగారు, మన ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డికి పిల్లనిచ్చిన మామ. కానీ అదొక గొప్ప సంగతే కాదన్నట్లు వ్యవహరించడం రమణారెడ్డి నిరాడంబరత. ఆయనకు అల్లూరు ప్రజలతోపాటు, మేము కూడా అభినందనలు తెలియజేస్తున్నాము.














తలపెట్టిన పనులన్నీ సామాన్యంగా సాగుతాయి. శరీరారోగ్యంలో తేడాలుంటాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారి పనులు సామాన్యంగా వుంటాయి. అధిక ఖర్చులు, ఇతరులతో అగ్రిమెంట్ల వ్యవహారాలలో ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. బుద్ధిమాంద్యం వల్ల కలహాలు కొనితెచ్చుకొనే సూచనలున్నాయి. విద్యార్థులకు సంతృప్తికరంగా వుంటుంది. రాజకీయులకు మిశ్రమ ఫలితాలుంటాయి.




గ్రహాల ప్రతికూలతల వల్ల తలపెట్టిన కార్యక్రమాలలో ఆటంకాలు, లేదా నిదానంగా సాగడం వుంటుంది. వృత్తి, వ్యాపారాలలో నూతన కార్యక్రమాలు చేపట్టక చేస్తున్న పనులపై శ్రద్ధ పెట్టడం మంచిది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. ఇంట్లో శుభకార్య యత్న ప్రయత్నాలు సాగుతాయి. వ్యవసాయదారులకు అనుకూల పవనాలున్నాయి. రాజకీయులకు మిత్రులతో మనస్పర్థలుంటాయి.




ఈ వారం నుంచి గురు, శని, రాహువులు దోషులుగా వుండడం చేత చేపట్టిన పనులు అటుఇటుగా పూర్తి చేస్తారు. అకారణంగా ధన వ్యయం వుంటుంది. వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాల వారికి సాధారణ స్థితి, ఆదాయం సామాన్యంగా వుంటుంది. విద్యార్థులు ఇప్పటి నుంచే పునశ్చరణలకు ప్రాధాన్యం ఇవ్వడం మంచిది. విందులు, వినోదాలలో పాల్గొంటారు.




గ్రహవీక్షణలో కొంత వెసులుబాటు వల్ల చేపట్టిన పనులు పూర్తి చేయగల్గుతారు. వృత్తి, వ్యాపారాల వారు తోటివారి సహాయంతో పనులు పూర్తి చేసుకొంటారు. ఉద్యోగులు పై అధికారుల అనుకూలతలు సాధించాలి. విద్యార్థులు గట్టిగా విద్యపై పట్టు సాధించాలి. వ్యవసాయదారులు అవసరార్థం చేయు రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. రాజకీయులకు పై వర్గాలతో భేదాభిప్రాయాలుంటాయి.




గ్రహబలం మిశ్రమంగా వుండడం చేత తలపెట్టిన పనులన్నీ ఆటంకాలు లేకుండా పూర్తి చేస్తారు. నూతనంగా చేపట్టే పనులలో మీ కీర్తికి భంగం రాకుండా చూసుకొనేది. ఇంట్లో ఖర్చులధికమౌతాయి. విద్యార్థులకు బాగుంటుంది. వ్యవసాయదారులకు మిగులు శాతం కనపడుతుంది. కళ, క్రీడాకారులు వృత్తిపరమైన ఉత్సాహాన్ని పొందుతారు. రాజకీయులు గుర్తింపుకై తగిన ఏర్పాట్లు చేసుకోవాలి.




గ్రహాల ప్రతికూలతల వల్ల శరీరారోగ్య లోపాలు, చేపట్టిన పనులు నిదానంగా సాగుట, ఇంట్లో మీ మాటకు విలువ తగ్గుట, అనవసర వాదనలుంటాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ఆదాయం తగ్గుతుంది. ఉద్యోగులకు అధికార భంగాలు గోచరిస్తున్నాయి. విద్యార్థులకు సామాన్యంగా వుంటుంది. వ్యవసాయదారులకు పూర్వార్థ పంటల కన్నా, ఉత్తరార్థ పంటల ఆదాయం మిన్నగా వుంటుంది.

# వారఫలాలు

*తేది 6-4-2013 నుండి 12-4-2013 వరకు మేషంలో కేతువు; వృషభంలో గురువు; తులలో శని, రాహువులు; కుంభంలో బుధుడు 9తేది వరకు తదుపరి మీనంలో; మీనంలో రవి, కుజులు, శుక్రుడు 10తేది వరకు తదుపరి మేషంలో; మకర, కుంభ, మీన, మేషాలలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

8తేది మాస శివరాత్రి.
9తేది కృష్ణ అంగారక చతుర్దశి, సావిత్రి వ్రతం.
11తేది ఉగాది, జ్యోతిరావు పూలే జయంతి.
12తేది జమాది లవ్వల్ నెల ప్రారంభం.

### శుభ ముహూర్తాలు

శుక్ర మౌఢ్యమి కారణంగా వివాహాది శుభ కార్యాలకు శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య కార్యక్రమాలకు శుభముహూర్తాలున్నాయి.

### ఏప్రెల్ తిథులు

**ఫాల్గుణ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 6 | శని | ఏకాదశి | సా | 04.21 గం.ల.వ |
| 7 | ఆది | ద్వాదశి | ప | 03.23 గం.ల.వ |
| 8 | సోమ | త్రయోదశి | ప | 02.49 గం.ల.వ |
| 9 | మంగళ | చతుర్దశి | ప | 02.41 గం.ల.వ |
| 10 | బుధ | అమావాస్య | ప | 03.03 గం.ల.వ |

**చైత్ర శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 11 | గురు | నవమి | ప | 03.57 గం.ల.వ |
| 12 | శుక్ర | దశమి | సా | 05.22 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.




కుటుంబ వ్యవహారాలు చీకాకులు కల్గిస్తాయి. ఇంటా బయట అవమానాలు ఎదుర్కొనుట, వృత్తి, వ్యాపారాలుందు ఏకాగ్రత తగ్గుట, ఉద్యోగులకు పైవారితో భేదాభిప్రాయాలు వుంటాయి. విద్యార్థులు అన్య విషయాలకు దూరంగా వుండుట మంచిది. వ్యవసాయ దారులకు రెండవ పంటయందు ఆర్థికాదాయం వుంటుంది. కళ, క్రీడాకారులు రహస్య సమాలోచనలకు దూరంగా వుండుట మంచిది.




తలపెట్టిన పనులలో మూడింట రెండొంతులు పూర్తవుతాయి. బంధు మిత్రులతో స్నేహ బంధాలు పెరుగుతాయి. శుభకార్యాల నిమిత్తం నూతన వస్త్రాభరణాల కొనుగోలు, సరదా కాలక్షేపాలు ఆనందాన్నిస్తాయి. వృత్తి, వ్యాపార రంగాలలోని వారికి ఆదాయానికి తగ్గ ఖర్చులుంటాయి. సాహసించే నూతన కార్యాలకు దూరంగా వుండండి. వ్యవసాయదారులకు పనులందు ఆటంకాలుంటాయి.




గ్రహానుకూలతలు తగ్గుటచే ప్రతి పనికి పట్టుదల అవసరం. కుటుంబంలో జరుగు శుభకార్యాల నిమిత్తం అవసరానికి రుణాలు చేయవలసి వస్తుంది. సంతానంతో స్నేహ భావన చూపాలి. వృత్తి, వ్యాపారాలు పర్వాలేదనిపిస్తాయి. వ్యవసాయదారులకు భూ సంబంధిత లాభాలు. కళా, క్రీడాకారులకు నూతన పరిచయాల వల్ల లాభాలు, కుటుంబంలో సౌఖ్యం, వ్యవహారానుకూలతలున్నాయి.




గ్రహాల వ్యతిరేకత వల్ల ఇంట్లో, బయట అధిక ఒత్తిడులుంటాయి. సమయానికి డబ్బు చేతికందుతుంది. కుటుంబ సభ్యులతో వివాహాది శుభ కార్యాలలో పాల్గొంటారు. అయితే ఖర్చులు మాత్రం అధికంగా వుంటాయి. ఇంట్లోవారితో మాట పట్టింపులుంటాయి. తల్లిదండ్రులతో అనుకూలతలు సాధించాలి. చదువుపై శ్రద్ధ లేకపోవటంచే వ్యతిరేక ఫలితాలుంటాయి. వ్యవసాయదారులు ఇతరులచే మోసపోతారు.




చేస్తున్న పనులు సామాన్యంగా సాగుతాయి. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికాదాయం తక్కువగా వుంటుంది. విద్యార్థులకు గ్రహానుకూలతల వల్ల శుభాధిక్యత ఏర్పడుతుంది. వ్యవసాయదారులు ఈ పంటలలో సామాన్యతలుండి ఉత్తరార్థ పంటలలో ఆర్థికాభివృద్ధి సాధిస్తారు. కుటుంబ వ్యవహారాలలో అసమానతలు పెరిగి, చిన్నపాటి భేదాభిప్రాయాలుంటాయి. రాజకీయులకు రాజకీయంగా లాభిస్తుంది.




ఇంటాబయట అకారణ విరోధాలు, మాట్లాడితే తగవులు వుంటాయి. సంతోషం పొందలేరు. చేపట్టిన పనులలో ఆటంకాలు లేదా వికటించుట జరుగుతుంది. అనవసరపు ఖర్చు, ఆరోగ్య భావనలు చిన్నవైనా పెద్ద జాగ్రత్తలు అవసరమౌతాయి. విద్యార్థులకు ఇది కష్టకాలం. మీ ఆత్మీయులు తమ అవసరాలు తీర్చుకుంటారు. వ్యవసాయదారులకు రుణ సౌకర్యం లభిస్తుంది.

# పాశ్చాత్య శాస్త్రవేత్త గౌరవించిన 'వాస్తు శాస్త్ర రీతులు!

*డాక్టర్ పి.సి.ఆంజనేయులు — హైదరాబాద్*

** వాస్తు శాస్త్ర పద్ధతిని ఓ సందర్భంలో డాక్టర్ 'ఫ్లేమ్‌స్టీడ్' అనే ఖగోళ శాస్త్రవేత్త ప్రశంసించారని విన్నాను.*

అంతర్జాతీయ సదస్సులో 'ఫ్లేమ్‌స్టీడ్'(ఖగోళ శాస్త్రవేత్త) భారతీయ శాస్త్రాల్లో జ్యోతిష, వాస్తు శాస్త్ర రీతులను ప్రశంసించి 'గ్రీనిచ్' నక్షత్రశాల శంఖు స్థాపనకు ఆయన మంచి ముహూర్తాన్ని ఎంచుకోవడమేగాక, వాస్తురీత్యా మ్యాప్ తయారు చేసుకున్నారు.

*డాక్టర్ అరికేశవుల విశ్వనాథ్ — చెన్నై*

** 'మౌఢ్యమి'పై క్యాలెండర్లలో రకరకాలుగా తేదీలు చెప్పారు. ఎందువల్ల?*

చంద్ర, సూర్య సిద్ధాంతాలు కొన్ని అంశాలలో విభేదిస్తాయి. దీన్ని సాకుగా కొందరు వ్యక్తులు వివిధ విధాన, నిదానాలు సృష్టించారు. క్యాలెండర్లలో 16 నుంచి 22 తేదీలలో శుక్రమౌఢ్యమి ప్రారంభమౌతున్నట్లు చెప్పారు. నిజానికి సూర్య సిద్ధాంత పంచాంగాలు 22 అర్థరాత్రి నుంచి 'మౌఢ్యం' ప్రారంభమని చెప్పాయి. దీన్నే నేను సమర్థిస్తాను.

*వై.వి.ఆర్ — విజయవాడ*

** ఆయన మారుతాడా? నా సంసారం చక్కబడుతుందా?*

ప్రశస్తమైన బీజాక్షర యంత్రాన్ని ఉత్తరంలో సూచించాను. దాన్ని ప్రతిష్ఠించుకోండి. నేను చెప్పిన రత్నధారణ చేయండి. అతను మారి తీరుతాడు.

*డి.పరాశరశర్మ — ఏలూరు*

** ఒకే నక్షత్రం వున్న వధూవరులకు వివాహం చేయవచ్చా?*

రోహిణి, ఆర్ద్ర, పుష్యమి వంటి అష్ట, అశ్విని, కృతిక వంటి ఏకాదశ నక్షత్రాలలో వివాహం చేయవచ్చు. భరణి, జ్యేష్ఠ, శతభిషం వంటి అష్ట నక్షత్రాలలో వివాహం కూడదు.

*పి.వి.కె.శాస్త్రి — విజయవాడ*

** పుట్టిన తేదీ, సమయాలలో ఏది జీవితంలో ప్రముఖ పాత్ర వహిస్తుంది?*

పుట్టిన తేదీకంటే సమయం వల్ల నిర్ధారణమయ్యే నక్షత్ర ప్రభావం జీవితంపై చాలా వుంటుంది. అయితే తేదీ రాశిఫలాలు కూడా చాలా వరకు ప్రభావాల్ని చూపిస్తాయి.

*ఎచ్చుల సునీత — కర్నూలు*

** మీరు సూచించిన యంత్ర ప్రతిష్ట తర్వాత అమ్మాయి వివాహం కుదిరింది.*

యంత్ర ప్రతిష్ట తర్వాత మీరు నిష్ఠగా చేసిన మండల పూజ ఫలితమిది. అమ్మాయి ఇష్టపడితే యంత్ర ప్రాణస్థితి రెండు సంవత్సరాలు గనుక యంత్రాన్ని అమ్మాయితో ఆమె గృహానికి పంపించండి. రక్షణగా ఉపయోగపడుతుంది.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*గురజాల అరుణ — గుంటూరు*

** కంప్యూటర్ జాతకం గురించి మీ అభిప్రాయం చెప్పండి?*

లోపలికి పంపిన(ఫీడింగ్) వివరాలే మళ్లీ మళ్లీ బయటకు వస్తాయి. జాతకం గణించి, గుణించి, శాస్త్రీయంగా పరిశోధించి రాయడం మంచిది.

*డాక్టర్ సింధు — బెంగుళూరు*

** నెల్లూరు, ప్రకాశం సరిహద్దులోని భైరవకోన ఎందువల్ల ప్రఖ్యాతి చెందలేక పోయింది?*

క్రీ.శ 7వ శతాబ్ది అద్భుత శివాలయ గుహాలయాల నిర్మాణం భైరవకోనలోని తూర్పు పర్వతాలు, పశ్చిమం పల్లం వంటి వాస్తు దోషాల వల్ల సుప్రసిద్ధ పర్యాటక కేంద్రం కాలేకపోయింది.

*పి.వెంకటేశ్వర్లు — నెల్లూరు*

** నెల్లూరు ఫత్తేఖాన్‌పేట ప్రాంతంలో వివాదాలెక్కువ వుంటాయి ఎందువల్ల?*

అక్కడ నైరుతి, వాయువ్య దోషాలు, ఈశాన్యం లోపించడం దక్షిణ పంట కాలువలు ఉత్తర (కుబేర స్థాన) వైధృతి వల్ల కలహకారణమవుతున్నది. అయితే మధ్యస్థ స్థానంలో ఆలయాల వల్ల పరిస్థితి కొంత పరిష్కారమవుతున్నది.

*టి.షర్మిళ — సికింద్రాబాద్*

** అనూరాధ నక్షత్రం మా అమ్మాయిది. మృగశిర అబ్బాయిది. మంచిది కాదని చెప్పారు.*

పూజారి ఎవరో అపండితుడై వుండాలి. అనూరాధకు ఆరుద్ర వ్యతిరేక నక్షత్రం. భరణి వేధో నక్షత్రం. మృగశిర వ్యతిరేకం కాదు.

# భూ వివాదాలను తీర్చే వాళ్లెవ్వరు?

భూమి కొనుగోలు పథకం ద్వారా ఎస్సీ కార్పొరేషన్ అందించిన భూమిని ఇతరులు అన్యాక్రాంతం చేయడంతో తిరిగి వాటిని స్వాధీనం చేయాలని కోరుతూ సంవత్సరాల తరబడి లబ్దిదారులు తిరుగుతున్నా అధికారులు దయ చూపడం లేదు. ఇందుకు ఉదాహరణగా విడవలూరు మండలం పార్లపల్లి దళితులను పేర్కొనవచ్చు. ఎస్సీ కార్పొరేషన్ ద్వారా దాదాపు 10 సంవత్సరాల క్రింద పార్లపల్లి దళితవాడకు చెందిన తారుముళ్ల పెద్దవెంకయ్య తారుముళ్ల సునీత అనే వారికి దంపూరు గ్రామం సర్వే నెంబర్‌లో 73/ఎలో ఒక్కొక్కరికి 54 సెంట్లు మాగాణి భూమి అందించడం జరిగింది. ఈ పథకం ద్వారా లబ్దిదారులు ఎస్సీ కార్పొరేషన్‌కు చెల్లించాల్సిన బకాయిలను రుణమాఫీ పథకం ద్వారా 2008వ సంవత్సరంలో ప్రభుత్వం రద్దు చేయడం జరిగింది. ఆర్థిక ఇబ్బందుల కారణంగా పార్లపల్లి గ్రామానికి చెందిన రామచంద్రయ్య అనే వ్యక్తి దగ్గర కొంత అప్పు చేశారు. సకాలంలో అప్పు తీర్చలేక పోవడంతో లబ్దిదారుల భూమిని అధికారుల అండతో స్వాధీనం చేసుకున్నారు.

అల్లూరు సబ్ రిజిస్ట్రార్ కార్యాలయంలో లబ్దిదారుల పేరున రిజిష్టర్ కాబడిన భూములను అన్యాక్రాంతం చేసిన విషయాన్ని పలుమార్లు ఉన్నతాధికారులకు విన్నవించుకున్నప్పటికి ఎవరు కూడా పట్టించుకున్న దాఖలాల్లేవు. మూడు సంవత్సరాల క్రితం విడవలూరు తహశీల్దార్‌గా వుండి పదవీ విరమణ చేసిన భాస్కర్‌రావు సైతం లబ్దిదారులకు వ్యతిరేకంగా జిల్లా కలెక్టర్‌కు నివేదికలు పంపారని బాధితులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. జిల్లా జాయింట్ కలెక్టర్ కోర్టులో కూడా భూముల్ని స్వాధీనం చేయాలని కోరుతూ అప్పీలు దాఖలు చేసుకున్నారు. వీటిపై పూర్తిస్థాయి నివేదికను పంపాలని తహశీల్దార్‌ను ఆదేశించారు. ప్రభుత్వం పేదలకు పంపిణీ చేసిన భూముల్ని అమ్మరాదు. కొనరాదన్న నిబంధన వుంది. 2010 సంవత్సరంలో తహశీల్దార్ జిల్లా కలెక్టర్‌కు పంపిన నివేదికలో లబ్దిదారులు సునీత వెంకటక్రిష్టయ్య వద్ద 10వేలు, నెల్లూరు శేఖరయ్య వద్ద 27 వేల రూపాయలకు పొలం తాకట్టుపెట్టి అప్పు తీసుకున్నారని పేర్కొన్నారు.

అప్పు తిరిగి చెల్లిస్తే అప్పు ఇచ్చిన వారి స్వాధీనంలో వున్న పొలాన్ని విడిచిపెట్టే అవకాశం వుందని నివేదికలో తెలిపారు. వాస్తవంగా ప్రామిసరి నోటు ద్వారా అప్పు తీసుకుంటే సకాలంలో బాకీ చెల్లించని పక్షంలో కోర్టును ఆశ్రయించి న్యాయపరంగా బాకీ వసూలు చేసుకోవాలి. అయితే ఇక్కడ గతంలో గ్రామ రెవెన్యూ సహాయకుడిగా వుండి ఇటీవల విఆర్వోగా పదోన్నతి పొందిన వ్యక్తి ఈ వ్యవహారాన్ని నడిపిస్తున్నాడని లబ్దిదారులు వాపోతున్నారు. ఇతను రెవెన్యూ శాఖలో పని చేస్తుండడంతో అప్పటి తహశీల్దార్‌తో విఆర్వో బంధువులకు అనుకూలంగా నివేదిక ఇప్పించుకున్నారన్న ఆరోపణలున్నాయి. రుణమాఫీ పథకం క్రింద లబ్దిదారులు చెల్లించాల్సిన రుణం రద్దుకాబడిన విషయాన్ని కూడా లబ్దిదారులకు తెలియకుండా విఆర్వో జాగ్రత్తపడ్డాడు. నిరక్ష్యరాసులైన లబ్దిదారుల చేత వివిధ రకాల పత్రాలపై సంతకాలు చేయించుకున్నారని వారు చెబుతున్నారు.

**జిల్లాలో భూ వివాదాలు పెచ్చు పెరిగి పోతున్నాయి. విడవలూరు మండలం పార్లపల్లి దళితవాడకు చెందిన తారుమళ్ళ పెద్ద వెంకయ్య, సునీత భూమి కొనుగోలు పథకంలో భాగంగా దంపూరు గ్రామంలోని సర్వే నంబరు 73 / ఎలో కేటాయించిన 54 సెంట్ల భూమి కోసం గత పదేళ్లుగా పెద్ద పోరాటమే చేస్తున్నారు.**

మండల తహశీల్దార్ స్థాయిలో ఈ భూముల సమస్యను పరిష్కరించే అవకాశం వున్నప్పటికీ ఆ దిశగా ఎటువంటి ప్రయత్నాలు జరగలేదు. అధికారుల వైఖరితో విసుగు చెందిన అసలు లబ్దిదారులు జాయింట్ కలెక్టర్ కోర్టుకు వెళ్లగా వీరికి అనుకూలంగానే తీర్పు వచ్చింది. జాయింట్ కలెక్టర్ ఉత్తర్వులు సవాల్ చేస్తూ భూముల్ని అన్యాక్రాంతం చేసిన వారు కోర్టుకు వెళ్లారు. రుణమాఫీ పథకం వర్తింపచేసిన తర్వాత ఎస్సీ కార్పొరేషన్ తాకట్టులో వున్న భూమిని లబ్దిదారుల పేరున తిరిగి రిజిస్ట్రేషన్ చేయాల్సి వుంటుంది. కాని ఇక్కడ ఎస్సీ కార్పొరేషన్ సహాయ కార్యనిర్వాహణాధికారి హోదాలో ప్రేమ కుమారి అనే ఉద్యోగి ఆక్రమణదారులకు పూర్తిగా సహకరించారంటున్నారు. అప్పటి ఎస్సీ కార్పొరేషన్ అధికారులు భూముల వ్యవహారంపై సమగ్ర విచారణ జరపలేదు.

ఆరుముళ్ల సునీతకు సంబంధించిన భూమిని వెంకటక్రిష్టయ్య, వెంకటసుబ్బమ్మకు చెందిన భూమిని వెంకట వరదాచార్యుల ఆధీనంలోనే వుంచుకొని సాగుచేస్తూ అందులో వస్తున్న ఫలింపును అనుభవిస్తున్నారు. జిల్లాస్థాయిలో బాధితులకు న్యాయం జరగనందున లోకాయుక్తను ఆశ్రయించారు. ప్రస్తుతం ఈ పార్లపల్లి దళితుల భూముల వ్యవహారం ఎన్ని మలుపులు తిరుగుతుందో వేచి చూడాలి.

# పరమ చెత్త జఫ్ఫా!



అల్లూరు రహీం

ప్రపంచంలోనే అత్యధిక చిత్రాల్లో నటించిన నటుడిగా బ్రహ్మోనందం గిన్నీస్ బుక్‌లో ఎక్కారు. బ్రహ్మోనందం హాస్యనటుడు. ఆయన్ను హీరోగా పెట్టి గతంలో కొన్ని సినిమాలు తీశారు. కానీ ఏ ఒక్కటీ హిట్ కాలేదు. తాజాగా మల్టీ డైమెన్షన్ ఎంటర్‌టైన్‌మెంట్ పతాకంపై రమేష్ వర్మ నిర్మించిన చిత్రం 'జఫ్ఫా' కూడా గతకుల బాటే నడిచింది. ప్రస్తుతమున్న పరిస్థితుల్లో బ్రహ్మోనందం కాల్షీట్స్ దొరకడమే కష్టం. అటువంటిది ఒక సినిమాకు కాల్షీట్స్ తీసుకొన్న నటుడు వెన్నెల కిషోర్ ఈ చిత్రానికి కథ, మాటలు, స్క్రీన్‌ప్లేతోపాటు దర్శకత్వపు బాధ్యతలు నెరిపాడు. వెన్నెల కిషోర్ జూనియర్ హాస్యనటుడు. జఫ్ఫాలో బ్రహ్మోనందం టాలెంట్‌ను వాడుకోవడం ఆయనకు చేత కాలేదు. ఈ సినిమా మొత్తం జైలులోనే నడిపాడు. ఇక నవరసాలు కూర్చడం ఎలా సాధ్యం? వాస్తవంగా చెప్పాలంటే జఫ్ఫా సినిమాగా కాకుండా చిన్న చిన్న స్కిట్స్ ఆధారంగా కథ ముందుకు నడుస్తుంటుంది. మంచి మాటలు లేవు. ఒక్క పాటా లేదు. ఇక ఈ సినిమాను ప్రేక్షకులు ఎలా చూడగలరు. ఈటీవీలో ఈ మధ్య నడుస్తున్న 'జబర్‌దస్త్' కార్యక్రమం దర్శకునిలో కొన్ని ఆలోచనలు రేకెత్తించినట్లుంది. ఈ ఎపిసోడ్‌లో కనిపించే వేణు, రాఘవ, రఘు, చంద్ర, ధన్‌రాజ్, చంటిలను ఈ సినిమాలో పెట్టుకొన్నాడు. జబర్‌దస్త్ తరహా స్కిట్స్ నడిపే ప్రయత్నంలో వెన్నెల కిషోర్ బొక్కాబోర్లా పడ్డాడు. స్క్రీన్‌ప్లే ప్రథమార్ధం వరకు బాగున్నా ద్వితీయార్ధంలో బాగా బలహీనమైపోయి చిత్రాన్ని ప్రేక్షకులు చూడడమే కష్టమై పోయింది. బ్రహ్మోనందం వందలాది సినిమాల్లో నటించి సంపాదించుకొన్న పేరు జఫ్ఫా – డఫ్ఫా చేసి పారేసిందనాలి.




చిత్ర కథలోనికి వెళ్తే సాఫ్ట్‌వేర్ కంపెనీలో పనిచేసే జాస్మిన్ ఫల్గుణ సంక్షిప్త నామమే జఫ్ఫా(బ్రహ్మోనందం). ఈ కంపెనీకి మేల్కొటే(మేల్కొటే) బాస్. సుజిత్(ధన్‌రాజ్) జఫ్ఫా సహోద్యోగిగా పనిచేస్తుంటాడు. మేల్కొటే పెట్టే హింస భరించలేక అతన్ని చంపాలని ప్లాన్ వేస్తాడు జఫ్ఫా. అది వికటించి సుజిత్ చనిపోవడంతో జఫ్ఫా జైలుకు వెళ్తాడు. కవ్వాడిగూడ జైలు సూపరింటెండెంట్ నిఖిల్(వెన్నెల కిషోర్). ఆయన జైలులో ఖైదీలకు కాస్త స్వేచ్ఛనిస్తూ వాళ్లలో మార్పు తేవాలని ప్రయత్నిస్తుంటాడు. చంటి, రఘు, చంద్ర, వేణు, రఘుబాబు వివిధ నేరాలు చేసి జైలులో శిక్షలనుభవిస్తుంటారు. వీరందరూ జఫ్ఫాను బాస్‌గా ఎంచుకోవడంతో అతనిచ్చే సలహాలకు వారు ప్రవర్తించే తీరుకు జైలర్ గింగిరాలు తిరుగుతుంటాడు. చివరికి జైలర్ నిఖిల్ కూడా జఫ్ఫాను గురువుగా స్వీకరిస్తాడు. జైలులో కరుడుగట్టిన తీవ్రవాది ఇంటరాగేషన్‌కు జఫ్ఫా సలహా అడుగుతాడు. ఇంటరాగేషన్‌లో అతి పోకడలను భరించలేక అతను ఆత్మహత్య చేసుకొంటాడు. జైలు నుంచి తప్పించుకోవడానికి జఫ్ఫా మాస్టర్ ప్లాన్ వేస్తాడు. ఇది వికటించి జైలర్‌నే చనిపోతాడు. జఫ్ఫా తప్పించుకోవడంపై సిబిఐ అధికారి తపస్వీ కాట్రగడ్డ(అలీ) విచారణకు దిగుతాడు. అంతిమంగా జఫ్ఫా ఓ కిడ్నీ రాకెట్‌ను ఛేదించను ఈ పని చేశాడని ప్రసార మాధ్యమాలు వార్తలు ప్రసారం చేయడంతో మిస్టర్ క్లీన్‌గా ఆయన బాహ్య సమాజంలోనికి రావడంతో సినిమా సమాప్తమవుతుంది. బ్రహ్మోనందం వరకు జఫ్ఫాగా తన పాత్రకు న్యాయం చేయాలని చివరివరకు ప్రయత్నించాడు. కానీ అది వికటించిన దానికి కిషోర్‌ను బాధ్యుడ్ని చేయక తప్పదు. లేని తలనొప్పి తెచ్చుకోవాలంటే జఫ్ఫాకు వెళ్లాలి.

## గమనించి నడుస్తాను!



తొలి సినిమాకే కావల్సినంత పేరు సంపాదించుకొన్న హీరోయిన్లలో సోనాక్షి సిన్హా ఒకరు. మిగతా హీరోయిన్లు సైతం అసూయపడేలా సల్మాన్ ఖాన్‌తో కలసి తన తొలి సినిమా చేసింది ఈ ముద్దుగుమ్మ. ఆ తర్వాత అవకాశాలు వరుసకట్టాయి. దబాంగ్ తర్వాత అక్షయ్‌కుమార్‌తో జోకర్, రౌడీ రాథోడ్, సన్ ఆఫ్ సర్దార్ లాంటి చిత్రాల్లో నటించి తన సత్తా ఏంటో నిరూపించుకొంది. ప్రస్తుతం 'లుటెరా' చిత్రంలో నటిస్తోంది. తన జీవితంలో లుటెరా గుర్తుండిపోయే చిత్రమవుతుందంది. ఈ సినిమా కోసం చాలా కష్టపడి పని చేస్తున్నాను. ఈ సినిమా కోసం నేర్చుకొంటున్న ప్రతి విషయం నా జీవితానికి ఉపయోగపడేదే. పాతతరం నాయికలైన వహీదా రెహమాన్, మధుబాల, సుచిత్రాసేన్‌లను ఆదర్శంగా తీసుకొని నా జీవితాన్ని కొనసాగిస్తాను. వారి స్ఫూర్తితోనే 'లుటెరా'లో నటిస్తున్నాను. ఇప్పటికీ ఖాళీ సమయం దొరికితే పాత సినిమాలు చేస్తూ అప్పటి హీరోయిన్లు ఎలా నటించారనే విషయాన్ని జాగ్రత్తగా గమనిస్తుంటానని చెప్పుకొచ్చింది.

## ఇంటి నుంచే మార్పు



మహిళల భద్రత గూర్చి దేశమంతా ఎడతెగని చర్చ జరుగుతున్న తరుణంలో ఎలాంటి అఘాయిత్యాలు జరగకూడదంటే ముందు మన ఇంటి నుంచే మార్పు రావాలంటుంది హీరోయిన్ బిపాసబసు. ప్రస్తుత సమాజంలో మహిళలు మానసిక ధృడత్వంతోపాటు ఆర్థిక స్వావలంబన కలిగుండాలి. మహిళలు ఎవరినైనా నమ్మితే సర్వం అర్పిస్తారు. ఆ తర్వాత వారికి వేరే రకమైన ఫలితాలు ఎదురైతే? అప్పుడు వారి పరిస్థితి ఏమిటి? అందుకే ఆర్థికపరమైన విషయాల్లో మహిళలు మరింత భద్రతగా మెలగాలి. అలాగే ఏదైనా ఓ సంఘటన జరిగినప్పుడు మహిళలు మానసికంగా ఎంతో కుంగిపోతుంటారు. అది జీవితం పై ఎంతో చెడు ప్రభావాన్ని చూపుతుంటుంది. కొన్ని సంఘటనలు మర్చిపోవాలంటే మనకంటే బలమైన ఆలోచనలు కలిగిన వ్యక్తి మనకు దొరకాలి. లేదా జీవితంలో ఎదురైన అనుభవాల నుంచి గుణపాఠం నేర్చుకొని అందుకు తగ్గట్టుగా మానసిక స్థాయిని మార్చుకోవాలి. ఇవన్నీ నాకు అనుభవపూర్వకంగా తెలిసిన విషయాలు. అందుకే ఆ విషయాల్లో చాలా జాగ్రత్తగా ఉండాలంటుంది.

## మార్పు కనబడుతుంది



మార్పు అనేది నిరంతర ప్రక్రియ. మరీ ముఖ్యంగా సృజనాత్మక రంగమైన చిత్రసీమ ఎప్పటికప్పుడు మారుతూనే ఉంటుందంటుంది అలనాటి మేటి నటి శ్రీదేవి. దాదాపు 15 ఏళ్ల విరామం తర్వాత ఈ మధ్యనే ఆమె కొత్త ఇన్నింగ్స్ మొదలు పెట్టింది. ఈ విరామంలో గమనించిన మార్పు ఏమిటని అడిగితే నేను విరామం ప్రకటించేందుకు ముందు ఉన్న వాతావరణానికి ఇప్పటికీ సంబంధమే లేదు. మరీ ముఖ్యంగా సినీ ప్రచార విషయంలో అప్పట్లో చాలా కొద్ది పత్రికలే వుండేవి. వాటితోనే ఎక్కువగా మాట్లాడేదాన్ని. అది కూడా సినిమా కబుర్లకే పరిమితమయ్యే వాళ్లం. ఇప్పుడట్లా కాదు. సినిమా తారలు సెలబ్రిటీలుగా మారిపోయారు. సినిమాను రకరకాలుగా ప్రచారం చేసుకొంటున్నారు. అందులో వ్యక్తిగత విషయాలు కలసిపోతున్నాయి. ఇప్పటి వాతావరణానికి ఇది బాగానే ఉందని చెప్పింది.



## ఐ లవ్ యూ ఆండ్రియా!



హీరోయిన్ ఆండ్రియా యుగానికొక్కడు, విశ్వరూపం చిత్రాల ద్వార ప్రేక్షకులను బాగా అలరించింది. ఆండ్రియా కేవలం నటి మాత్రమే కాదు చక్కని గాయని కూడా. బొమ్మరిల్లు, రాఖీలాంటి చిత్రాల్లో గీతాలతో ఆలరించింది. ఈ చెన్నై భామకు ఓ మళయాళ హీరో నుంచి ప్రేమ ప్రతిపాదన వచ్చింది. అసలు విషయం ఏమిటంటే ఆండ్రియా ఈ మధ్యనే అన్నియుమ్ రసూలుమ్ అనే మళయాళ చిత్రంలో నటించింది. ఈ సినిమాతో ఫర్హాద్ ఫాజిల్ హీరో. ఈయన దర్శకుడు ఫాజిల్ కుమారుడు. ఈ సినిమా చిత్రీకరణ సందర్భంలో ఏర్పడ్డ పరిచయం పెరిగి పెద్దదైంది. ఈ విషయాల్ని ఫర్హాద్ వెల్లడిస్తూ ఆండ్రియాకున్న సంగీత జ్ఞానం నాకెంతో నచ్చింది. అంతే కాదు ఆమె సెన్సాఫ్ హుమర్ మరచిపోలేనిది. అందుకే ఆమె మీద ఇష్టం పెరిగింది. ఆమెను ప్రేమిస్తున్నానన్నాడు. అయితే ఈ విషయమ్మీద ఆండ్రియా ఇంకా పెదవి విప్పలేదు.

## ప్రేమలో పడ్డారా?



హీరో సిద్ధార్థ్, హీరోయిన్ సమంత పెళ్లి చేసుకోబోతున్నారా? ప్రస్తుతం ఈ విషయంపై తెలుగు చలన చిత్రసీమలో ఆసక్తికర చర్చ జరుగుతోంది. జబర్‌దస్త్ సినిమాలో కలసి నటించడం మొదలు పెట్టాక వీరి మధ్య మొదలైన స్నేహం ప్రేమగా మారిందట. ఈ పుకార్లను బలపరుస్తూ వీరిద్దరూ ఇటీవల శ్రీకాళహస్తి వెళ్లి రాహుకేతు పూజలు కలసి చేయించుకొన్నారు. ఈ విషయమై సిదార్థ్‌ను ప్రశ్నిస్తే నా వ్యక్తిగత విషయాలకు సంబంధించిన అంశాలు ఏవైనా ఉంటే నేను చెబుతానంటూ తప్పించుకొన్నాడు.

## డ్రగ్ స్టోరును తనిఖీ చేసిన డిఎంఅండ్‌హెచ్‌ఓ!

జిల్లాలోని అన్ని పిహెచ్‌సిలకు అవసరాన్ని బట్టి కుక్కకాటు వ్యాక్సిన్ సరఫరా చేయాలని సెంట్రల్ డ్రగ్ స్టోర్ సిబ్బందిని జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ మాశిలామణి ఆదేశించారు. డిఎంఅండ్‌హెచ్‌ఓ 28వ తేది ఆకస్మికంగా నెల్లూరులోని సెంట్రల్ డ్రగ్‌స్టోరును సందర్శించారు. ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి గతంలో సెంట్రల్ డ్రగ్ స్టోర్‌ను సందర్శించిన సమయంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు అవసరమైన మందులు ఆర్థిక సంవత్సరం ముగుస్తున్నప్పటికీ తరలించకుండా నిల్వ ఉంచడాన్ని చూసి ఆగ్రహం వ్యక్తం చేశారు. దీంతో డిఎంఅండ్‌హెచ్‌ఓ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల సిబ్బందిని వెంటనే ప్రభుత్వం వారికి కేటాయించిన మందులు తీసుకెళ్లాలని లేకుంటే శాఖాపరమైన చర్యలు తీసుకుంటామని హెచ్చరించారు. ఈ నేపథ్యంలో డిఎంఅండ్‌హెచ్‌ఓ డ్రగ్ స్టోరును తనిఖీ చేసిన సమయంలో ఇస్కపల్లి, మహిమలూరు, సూళ్లూరుపేట, సంగం, ఆత్మకూరు పిహెచ్‌సిలకు తీసుకెళ్లని మందులను చూసి ఆగ్రహం వ్యక్తం చేశారు. వెంటనే వాటిని తీసుకెళ్లేలా ఫోన్ల ద్వారా సిబ్బందికి ఆదేశాలిచ్చారు.

## పంచాయితీ ఓటర్ల జాబితా సరిచేసుకోవచ్చు!

జిల్లాలో గత నెల 26వ తేది ప్రకటించిన గ్రామ పంచాయితీల ఓటరు జాబితాలో ఏవైనా పొరపాట్లు దొర్లుంటే వాటిని సరిచేసుకోవచ్చని అధికారులు ప్రకటించారు. మరో రెండు నెలల్లో జరుగనున్న పంచాయితీ ఎన్నికల నిర్వహణకు సంబంధించిన ఓటరు జాబితాలో 15 రోజుల వ్యవధిలో కార్యదర్శులు సిద్ధంచేసిన సంగతి తెలిసిందే. రూపొందించిన మండల పరిషత్, గ్రామ పంచాయితీ కార్యాలయ నోటీసు బోర్డుల్లో ప్రజలకు అందుబాటులో వుంచినట్లు అధికారులు చెప్పారు. ప్రజలతోపాటు రాజకీయ పక్షాలు జాబితాలను సరిచేసుకొని అభ్యంతరాలు తెలియజేయాల్సి వుంటుంది. మొత్తం జిల్లాలోని 940 గ్రామ పంచాయితీల్లో 13 లక్షల 92వేల 180 మంది ఓటర్లు వున్నారు. వీరిలో మహిళలు 7 లక్షల 3వేల 808, పురుష ఓటర్లు 6 లక్షల 88వేల 372 మంది వున్నారు. ఎస్సీలు 3 లక్షల 47వేల 875 మంది కాగా, వీరిలో పురుషులు లక్షా 71వేల 386 మంది, మహిళలు లక్షా 76వేల 519 మంది నమోదై వున్నారు. ఎస్టీ ఓటర్లు మొత్తం లక్షా 43,798 మంది వున్నారు. వీరిలో మహిళలు 74,175కాగా, పురుషులు 69,623 మంది వున్నారు. బిసి ఓటర్లు 5లక్షల 47వేల 542 మంది వుండగా వీరిలో మహిళలు 2లక్షల 77వేల 224, పురుషులు 2 లక్షల 70వేల 318 మంది వున్నారు. ఇతర కులాల వారు మరో 3లక్షల 52 వేల 866 మంది ఓటర్లుగా నమోదయ్యారు. మొత్తం మీద చూస్తే ఓటరు జాబితాలు గందరగోళంగా వున్నాయి.

## మత్స్యకారుల ఇళ్ల నిర్మాణానికి రూ.20వేలు!

### కొత్త పథకం

జిల్లాలో మత్స్యకారులకు మంజూరు చేసిన గృహ నిర్మాణాలకు అదనంగా 20వేల రూపాయలు అందించాలని ప్రభుత్వం నిర్ణయించింది. గృహ నిర్మాణ సంస్థ ద్వారా కొత్తగా మంజూరు చేసే గృహాలతోపాటు గతంలో మంజూరుచేసి అసంపూర్తిగా వున్న గృహాలకు అదనంగా 20వేల రూపాయలు అందించాలని గృహ నిర్మాణ సంస్థ కార్యదర్శి కరికాల వలవన్ ఉత్తర్వులు జారీ చేశారు. ఇప్పటివరకు ఇందిరమ్మ పథకం ద్వారా ఎస్సీ, ఎస్టీలు నిర్మించుకునే గృహాలకు మాత్రమే అదనంగా నిధులు అందించేవారు. ఇక నుంచి మత్స్యకారులకు కూడా ఇదే విధంగా నిధులు అందిస్తారు. తీరప్రాంతంలో సముద్రంపై ఆధారపడి చేపల వేట సాగించి జీవిస్తున్న మత్స్యకారులు గృహాలు నిర్మించుకునేందుకు ఆర్థికంగా ఇబ్బంది పడేవారు. ఎస్సీ, ఎస్టీల మాదిరిగానే తమకు కూడా గృహాలు పూర్తి చేసుకునేందుకు అదనంగా నిధులు మంజూరు చేయాలని ఎప్పటి నుంచో మత్స్యకారులు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నారు. తీరప్రాంత గ్రామాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న ఎమ్మెల్యేలు సైతం అదనంగా నిధులు మంజూరు చేయాలని ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చారు. దీంతో ప్రభుత్వం స్పందించక తప్పలేదు. ఇక నుంచి మత్స్యకారులు వారికి మంజూరు చేయబడిన గృహాలను త్వరితగతిన పూర్తి చేసుకోవచ్చు.

## అంగరంగ వైభవంగా రంగడి రథోత్సవం!


అశేష జనవాహిని మధ్య సాగుతున్న రంగడి రథం.

తల్పగిరి రంగనాథ స్వామి బ్రహ్మోత్సవాలు వైభవంగా జరిగాయి. జిల్లా నలుమూలల నుంచే కాకుండా రాష్ట్రంలోని పలు ప్రాంతాల నుంచి భక్తులు అధిక సంఖ్యలో హాజరై రంగనాధుడిని దర్శించుకొన్నారు. ఈ బ్రహ్మోత్సవాల్లో అతి ముఖ్యమైన రథోత్సవం మార్చి 29వ తేది వైభవంగా జరిగింది. ఉభయ నాంచారి సమేతుడైన రంగనాధస్వామిని రథంపై ఆశీనులను చేసి సాంప్రదాయబద్ధంగా ఈ ఉత్సవాన్ని నిర్వహించారు. సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి ఈ రథోత్సవాన్ని ప్రారంభించారు. తూర్పు వీధి నుండి ప్రారంభమైన ఈ రథోత్సవం నాలుగు కాళ్ల మండపం వరకు జరిగింది. భక్తులు అధిక సంఖ్యలో పాల్గొని ఉప్పు, మిరియాలు రథం క్రింద చల్లి మొక్కులు తీర్చుకోవడంతోపాటు గుమ్మడికాయలు కొట్టి కర్పూర హారతులు ఇచ్చారు. రంగ రంగా అంటూ భక్తిపూర్వకంగా నమస్కరించారు. ఈ స్వామికి వేదగిరి నరసింహస్వామి ఎదురేగడంతో ఎదురుకోలు కార్యక్రమం వైభవంగా జరిగింది. ఈ కార్యక్రమంలో ఆలయ ఇఓ పాయసం నాగేశ్వరరావు, దేవస్థానం మాజీ ఛైర్మన్ ప్రత్తి రవీంద్రబాబు తదితరులు పాల్గొన్నారు.

## ● పదవ తరగతి పరీక్షలు
## పద్ధతిగా జరగలేదు!

పకడ్బందీగా, ఎలాంటి అవకతవకలు జరుగకుండా పదవ తరగతి పరీక్షలు నిర్వహిస్తున్నామన్న అధికారుల హామీ గాలికి పోయింది. ఇన్విజిరేటర్ల నియామకం నుంచి సమస్తం కార్పొరేట్, ప్రైవేట్ పాఠశాలల కరస్పాండెంట్ల కనుసన్నలలో జరగడంతో మాస్ కాపీయింగ్‌కు తెరలేచింది. పదవ తరగతి పరీక్షల కోసం జిల్లావ్యాప్తంగా 171 పరీక్షా కేంద్రాలను ఏర్పాటుచేయగా 38,854 మంది విద్యార్థులు పరీక్షకు హాజరయ్యారు. పరీక్షలను సక్రమంగా నిర్వహించేందుకు 171 మంది డిపార్ట్‌మెంటల్ అధికారులను, 171 మంది చీఫ్‌లను, 214 సిట్టింగ్ స్క్వాడ్ బృందాలను, 10 ఫ్లైయింగ్ స్క్వాడ్ బృందాలను, 2090 మంది ఇన్విజిరేటర్లను నియమించారు. కరస్పాండెంట్ల అడుగులకు మడుగులొత్తే అధికారుల నుంచి విద్యాశాఖ సిబ్బంది వరకు కొందరు అక్రమాలకు తమ వంతు సహకారం అందించడంతో చాలా చోట్ల ప్రైవేట్ స్కూళ్ల విద్యార్థులు పరీక్షలు వ్రాసే కేంద్రాల్లో వారికి ఎలాంటి ఇబ్బంది కలుగకుండా తమ వంతు సహకారం అందించడంతో ఇన్విజిరేటర్ల నుంచి చీఫ్, డిపార్ట్‌మెంటల్ అధికారుల వరకు తమ వంతు పాత్ర పోషించడంలో ప్రతిభ కలిగి నిఖార్సుగా పరీక్షలు వ్రాసే విద్యార్థులు ఇబ్బంది పడ్డారు. బిట్ పేపర్లకు సమాధానాలు చెప్పడంలో ఆయా కరస్పాండెంట్ల నుంచి ముడుపులందుకొన్న సిబ్బంది స్వామి భక్తిని చాటుకొన్నారు. వీరికి ముందుగానే ఇలాంటి కార్యకలాపాలలో నిష్ణాతులైన కరస్పాండెంట్లు ఖరీదైన బహుమతులు, విందు, మందు పార్టీలు ఇచ్చి మచ్చిక చేసుకొన్నారట.

## సిఎం పర్యటన

మొదటి పేజీ కొరవ

ఇవి తప్ప ముఖ్యమంత్రి కార్యక్రమాలలో తతిమావన్నీ చిల్లర మల్లర సభలు, సమావేశాలే. జనం మధ్య తిరుగుతున్నట్లు కన్పిస్తూనే జనానికి దూరంగా మసలడంలో చాలా నేర్పరితనం ప్రదర్శించాడాయన. ఏ ఒక్క సామాన్యుడు కూడా ముఖ్యమంత్రిని సమీపించకుండా పెద్ద ఎత్తున పోలీసులు దడి కట్టారు. వినతి పత్రాలు, అర్జీలు కూడా పోలీసులే తీసుకొన్నారు. ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళిక, మహిళలు, యువత, రాజీవ్ యువకిరణాల లబ్ధిదారుల వంటి సదస్సులకు అధికారులు తీసుక వచ్చిన వారిని మాత్రమే అనుమతించారు. వారికి ముందుగానే కోచింగ్, కౌన్సిలింగ్ చేశారు. ఇబ్బంది కల్గించే ప్రశ్నలు వేస్తే తాట తీస్తామని బెదిరించి, అందరి నోళ్లు మూయించారు. ముఖ్యమంత్రి ఏ ప్రశ్న అడిగినా సర్వం సుభిక్షంగా వుందనే సమాధానాలు మాత్రమే ఇప్పించారు. దానితో ఆయన తన పాలనలో ఎంతో సుఖంగా బ్రతికేస్తున్నారనే నమ్మకం కల్గించుకొని సంతోషంగా వెళ్లి పోయాడు.

ఈ పర్యటన పర్యవేక్షణ సమస్తం ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి కనుసన్నలలో నడిచింది. ముఖ్యమంత్రి కంటే దేముడు ఈ భూమి మీద మరొకడు లేడనే రీతిలో ఆకాశానికెత్తి పొగిడేశాడు రామనారాయణరెడ్డి. సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి తన నియోజకవర్గ సభలకు మాత్రమే పరిమితమైనాడు. తతిమా చోట లాంఛన ప్రాయపు హాజరు మాత్రమే. ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి మాత్రం అంతా తానై కన్పించాడు. ముఖ్యమంత్రి అప్పుడప్పుడు ఆయన భుజంమీద చెయ్యి వేయడంతో ఏనుగెక్కినంత సంబరపడ్డాడు వాకాటి నారాయణరెడ్డి. కేంద్ర మంత్రి పనబాక లక్ష్మి కూడా ఈ పర్యటనలో అక్కడక్కడా పాలు పంచుకొన్నారు. మెడికల్ కాలేజి స్థాపనకు పుణ్యం కట్టుకొన్నది ముఖ్యమంత్రి అని రామనారాయణరెడ్డి పదే పదే చెప్పడం ఆమెకు నచ్చినట్లు లేదు. ఈ పుణ్యకార్యంలో నా ఉడతా భక్తి ప్రయత్నం కూడా వుందని ఆర్థికమంత్రి మాటలకు సవరణ ప్రతిపాదించారు పనబాక లక్ష్మి.

ఇంతకు మించి కిరణ్‌కుమార్‌రెడ్డి సుడిగాలి పర్యటనలో చెప్పుకోదగిన అంశాలు పెద్దగా లేవు. ముఖ్యమంత్రి అంతటివాడిని తెచ్చి నెల్లూరు నగర వీధులలో చిన్న చిన్న విగ్రహాలకు, రోడ్ పనులకు ఉపయోగించుకోవడం కొంచెం ఎబ్బెట్టుగా కన్పించింది.



## ప్రభాకర్‌రెడ్డిని చూసి నేర్చుకోండి!

డబ్బు సంపాదించడం గొప్ప కాదు. దానిని సద్వినియోగం చేయగల్గిన వాడే గొప్పవాడు. దానగుణం కంటే జన్మకు సార్థకత వుండదు. అది నిండుగా కల్గిన వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి వంటి వారిని చూసి తతిమా వారు నేర్చుకోవాలి... అన్నాడు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి. మినీబైపాసు రోడ్డులో ప్రతిష్టించిన సావిత్రీబాయి పూలే విగ్రహ ఆవిష్కరణ సభలో, ఆ విగ్రహం ఖర్చు భరించిన వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డిని సత్కరించాడు ముఖ్యమంత్రి. ప్రభాకర్‌రెడ్డి తన దానగుణాన్ని మరింత విస్తరించి, అభాగ్యుల సేవలో తరించాలని అభిలషించాడు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

జరిగేందుకు సహకరించడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. కాపీయింగ్‌కు ప్రసిద్ధి చెందిన నరసాపురంతోపాటు ముదివర్తిపాళెం, కొత్తూరు పరీక్షా కేంద్రాలలోనూ కాపీయింగ్ జోరుగా జరిగినట్లు సమాచారం. ప్రైవేట్ స్కూళ్ల యాజమాన్యం ఇన్విజిలేటర్లు, పరీక్ష అధికారులను లోబరుచుకుని ఈ తతంగం నడిపించారట.

## వెనక్కు వెళ్లిన సముద్రం

ఇందుకూరుపేట మండలం మైపాడు సముద్రతీరంలో అర కిలోమీటరు మేర 1తేది సోమవారం సముద్రం వెనక్కు వెళ్లడం ఆందోళన కల్గించింది. ఈ హఠాత్ పరిణామంతో స్థానిక మత్స్యకారులు భయాందోళనలకు గురయ్యారు. అలలు విసురుగా వుంటున్నప్పటికీ సముద్రం వెనక్కు వెళ్లడం అరుదుగా జరిగే విషయం కావడంతో స్థానికులు భయపడ్డారు.

## జగన్ పార్టీకి కొత్త అధ్యక్షుడు

మొదటి పేజీ కొరవ

గతంలో ఒకసారి లోక్‌సభకు పోటీ చేశాడు. ఆ కోణంలో చూస్తే మేరిగ మురళీధర్ రాజకీయ కుటుంబీకుడి క్రిందే లెక్క. అయితే జిల్లా స్థాయిలో పార్టీని అదీ ఎన్నికల సమయంలో నిర్వహించగల్గిన సత్తా, అనుభవం, స్థోమత, అవగాహన ఎంతవరకు వుంటాయన్నది అనుమానం. కానీ నొచ్చుకొని వున్న మేకపాటి రాజమోహన్‌రెడ్డి మనసును మెప్పించడానికి వేరే దారి కన్పడక ఈ నిర్ణయం తీసుకొన్నట్లున్నారు జగన్ పార్టీ పెద్దలు.

అయితే జిల్లా బాధ్యత వదిలించుకోవడం కాకాణి గోవర్ధన్‌రెడ్డికి కూడా సంతోషమే తప్ప బాధ పడవలసింది ఏదీ లేదు. ఆయన సర్వేపల్లి నియోజకవర్గ అభ్యర్థిగా ఎంపికైనాడు. ఆ స్థానంలో తన గెలుపు మీద దృష్టి పెట్టి పని చేసుకోవడానికి జిల్లా బాధ్యతలు పెద్ద అడ్డంకిగా వున్నాయి. అందువల్లనే తనకు తానుగా రాజీనామాకు సిద్ధపడి వుండినాడు. ఇప్పుడు కాగల కార్యం గంధర్వులు తీర్చినట్లు రాజమోహన్‌రెడ్డి ఆ పుణ్యం కట్టుకొన్నాడు.

## జనవాణి

2వ పేజీ కొరవ

దగిన తీర్పు. ప్రజారంజకమైనది. తీర్పునిచ్చిన మహారాష్ట్ర ఆదాయపు పన్ను అప్పిలేట్ ట్రిబ్యునల్‌కు అభినందనలు.

పి.అరుణకుమారి నెల్లూరు

### ప్రభుత్వ డాక్టర్లు మారాలి!

నెల్లూరు పెద్దాసుపత్రిలో పని చేసే డాక్టర్లు అక్కడ తూతూమంత్రంగా వైద్య సేవలు చేస్తున్నారు. ఇక్కడకొచ్చే రోగులను నగరంలోని తమ క్లినిక్కులకు రమ్మని సలహా యిచ్చి ఫీజుగా 200 రూపాయలు వసూలు చేస్తున్నారు. ఆపరేషన్ల ఫీజు అలవిమాలినంత అడుగుతున్నారు. అటువంటి ఈ డాక్టర్లు తమను నెల్లూరులో కట్టబోయే మెడికల్ కాలేజీలో పోస్టింగులు ఇవ్వమంటూ డిమాండ్లు చేస్తున్నారు. వైద్య కళాశాలలో వృత్తి పట్ల నిబద్ధత, అంకిత భావం గల వైద్యులను నియమిస్తేనే అది ఏర్పాటు చేసిన గమ్యం వైపు సాగుతుంది. లేకుంటే పెద్దాసుపత్రిలా గబ్బుపడుతుంది.

సిహెచ్. హనుమంతరావు నెల్లూరు

# నెల్లూరులో పట్టుకు బిఎస్పీ ప్రయత్నం!

రాజ్యాధికారం కోసం బహుజనులు ఉద్యమించాలని అందుకు ఇప్పటి నుంచే సమాయత్తం కావాలని బహుజన సమాజ్‌పార్టీ జాతీయ నేతలు పిలుపునిచ్చారు. నెల్లూరు నగరం విఆర్సీ మైదానంలో 31వ తేది బహుజన సమ్మేళనం పేరుతో బహిరంగ సభ జరిగింది. గత మూడు సంవత్సరాల నుంచి బహుజన హితకారిణి పేరుతో జిల్లాలో అంబేద్కర్ జయంతి వివిధ కార్యక్రమాలు నిర్వహించేవారు. దీని ప్రధాన వ్యవస్థాపకులు ఐపిఎస్ అధికారి పట్టపు రవి బహుజన హితకారిణిని బిఎస్పీలో ఈ సందర్భంగా విలీనం చేస్తున్నట్లు ప్రకటించారు. ఎస్సీ, ఎస్టీ, బిసి ఇతర మైనార్టీవర్గాలు బిఎస్పీకి అండగా నిలిచి రాబోయే ఎన్నికల్లో ఓట్లేసి గెలిపించాలని ఇందులో పాల్గొన్న వక్తలు విజ్ఞప్తి చేశారు. ఉత్తరప్రదేశ్‌లో మాదిరిగా ఆంధ్రప్రదేశ్‌లో బిఎస్పీ రాజ్యాధికారం కట్టబట్టేందుకు ప్రతి కార్యకర్త కృషి చేయాలన్నారు.

బహుజన హితకారిణి సభ బిఎస్పీలో విలీనం చేయడంతో జిల్లా నలుమూలల నుంచి భారీసంఖ్యలో ప్రజలు తరలివచ్చారు. బహుజన హితకారిణి సభ ద్వారా కోవూరు అసెంబ్లీ ఉప ఎన్నికల్లో పట్టపు రవి అభ్యర్థిగా ఎన్నికల బరిలో దిగి 350 ఓట్లు సాధించిన సంగతి తెలిసిందే. 2014 సంవత్సరంలో జరగబోయే ఎన్నికల్లో ఎమ్మెల్యేగా పోటీ చేయాలన్నది ఆయన కోరిక. వాస్తవంగా జిల్లాలో బహుజన సమాజ్ పార్టీకి పెద్దగా బలం లేదు. ఎన్నికలు వచ్చిన ప్రతిసారి ఆపార్టీ తరపున ఎమ్మెల్యే, ఎమ్పీ అభ్యర్థులుగా ఎవరో ఒకరూ ఎన్నికల బరిలో వుంటున్నారు. సభలు, సమావేశాలకు హాజరవుతున్నా; దళితులు మాత్రం ఈ పార్టీ అభ్యర్థులకు ఓట్లు మాత్రం వేయడం లేదు. ఇందుకు అనేక కారణాలున్నాయి. గ్రామస్థాయి నుంచి పార్టీని బలోపేతం చేయలేకపోవడం, నేతల మధ్య స్పష్టమైన రాజకీయ అవగాహన లేమి, ఎన్నికల సమయంలో దళిత నాయకులు రాజకీయ పార్టీలకు అనుకూలంగా మారిపోవడం వంటి కారణాలు వున్నాయి.

1985-95 దశకంలో జిల్లాలో ప్రతి గ్రామంలో దళిత మహాసభ ఏర్పడింది. ఏ మారుమూల ప్రాంతంలో దళితులకు ఏ సమస్య ఎదురైనా వెంటనే స్పందించి ఆ గ్రామానికి చేరుకొని వాస్తవాలను తెలుసుకొనే వారు. ఈ క్రమంలో బిఎస్పీ ఆవిర్భవించడంతో కొందరు నేతలు ఎన్నికల్లో పోటీ చేయాలని మొగ్గుచూపగా మరికొందరు దళిత మహాసభలోనే వుండిపోయారు. ప్రధానంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ శాఖల్లో కీలక పదవుల్లో వున్నవారు ఆర్థిక సహకారం అందించేవారు. జిల్లా ప్రధాన కార్యదర్శిగా పనిచేస్తుండిన సుకపల్లి ప్రసాద్ ఆకస్మిక మరణంతో దళిత మహాసభను ముందుకు తీసుకెళ్లేవారు కరువయ్యారు. అనంతరం చోటు చేసుకున్న రాజకీయ పరిణామాల నేపథ్యంలో దీని వ్యవస్థాపకులు కత్తి పద్మారావు సైతం దళితుల సమస్యలపై స్పందించడంలో కొంత వెనుకబడిపోయారు. 1995 నుంచి జిల్లాలో దళిత ఉద్యమాలు నీరుగారిపోయాయి. ఎన్నికల సమయంలో మాత్రమే బిఎస్పీ తరపున నేతలు బయటకు వస్తుంటారు.

జిల్లాలో దళితులపై ఎటువంటి దాడులు జరిగినా పట్టించుకునే వారు లేకుండాపోయారు. దళితనేతలుగా చెప్పుకొనే వారిని బాధితులు న్యాయం కోసం ఆశ్రయించినా, న్యాయం జరగకపోవడం అటుంచితే ఆర్థికంగా దెబ్బతినాల్సి వస్తుందంటున్నారు. జిల్లాలో బహుజన సమాజ్ పార్టీ రాజ్యాధికారం చేపట్టాలంటే గ్రామస్థాయి నుంచి పార్టీని పటిష్టం చేయాల్సి వుంటుందని రాజకీయ విశ్లేషకులు అభిప్రాయపడుతున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో బిఎస్పీ సిద్ధాంతాలను ప్రజలకు వివరించే వారు లేకుండా పోయారు. బహుజన హితకారిణి సభ బిఎస్పీలో విలీనం చేసిన పట్టపు రవి వచ్చే ఏడాది జరగబోయే అసెంబ్లీ ఎన్నికల్లో ఏదో ఒక నియోజకవర్గం నుంచి పోటీ చేయాలన్న గట్టి తలంపుతో వున్నారు. జిల్లా ప్రజలు ఎవరివైపు మొగ్గు చూపుతారో వేచి చూడాలి.

# విజయాల బాట నడవని విజయ నామ సంవత్సరం!

**ఈ యేడాది అధిక వర్షాలు పడతాయి. దీనివల్ల పంటలు బాగా పండుతాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పరిపూర్ణ శుభత్వంతో కూడిన పరిపాలన ప్రజలకు అందించలేవు. షేర్ మార్కెట్లు ఒడిదుడుకులను ఎదుర్కొంటాయి. సాఫ్ట్‌వేర్ రంగం మాత్రం పుంజుకుంటుంది.**

ఉగాది పంచాంగం
అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం

ఈ సంవత్సరానికి చాంద్రమానము ననుసరించి 'విజయ' అని పేరు. మన హిందూ దేశంలో అనాదిగా అంటే వేదకాలానికి ముందరే ఈ భూమిపై గల చరాచర సృష్టికి రవ్యాది గ్రహ కిరణ ప్రభావానికి ఎంతో సంబంధమున్నట్లు గ్రహించి, మన మహర్షులైన బ్రహ్మ, సూర్యుడు, భృగు, బృహస్పతి, నారద, పరాశర, గర్గ, అత్రి, వశిష్ట, అంగీరస, యవ్వన, వ్యాస, వరహమిహిరాచార్య, జైమిని మొదలైన మహామహులు ఎందరో వారి స్వానుభవముతో వారి దివ్యదృష్టిచేత నేరుగా గ్రహ చలనాలను గుర్తించి, గ్రహాలు, నక్షత్రాలు, రాశులు వీటికి గల పరస్పర సంబంధం గుణించి, వాటి గూర్చి ఎన్నో శాస్త్రాలు రచించి మనకందించారు.

జ్యోతిష శాస్త్ర పరివర్తకులలో సూర్యుడు ప్రథమ గణనీయుడు. సూర్యప్రోక్తమైన సూర్య సిద్ధాంతం పరమ ప్రమాణంగా స్వీకరించి పైన తెలిపిన 18మంది ఈ జ్యోతిష శాస్త్రాన్ని రూపొందించారు. ఈ సూర్య సిద్ధాంతం చాలా సూక్ష్మమైనది. తిథి, వృద్ధి క్షయములను సూర్య సిద్ధాంత గణితంతో సాధించాలని స్పష్టంగా నిర్ణయించి, వృద్ధి క్షయాలను నిర్వచనం చేశారు.

## విజయ పంచాంగ పీఠిక!

బ్రహ్మ, దివ్య, పిత్ర్యః, ప్రజాప్రత్య, గౌరవ, సౌర, సావన, చాంద్ర, అర్ధ అను తొమ్మిది మానముల సంకల్పమందు ఆయా కార్యాలనందు ఉపయోగిస్తూ, నిత్య వ్యవహారాలకు నాలుగు బేధములను మాత్రమే ఉపయోగించుచున్నాము. అవి సౌర, చాంద్ర, సావన, అర్థ, నక్షత్ర మానాలు మాత్రమే.

సూర్యోదయం నుండి తిరిగి సూర్యోదయం వరకు 60 ఘడియలు లేదా 24 గంటలుగా నక్షత్ర మానాన్ని, ఆనాటి వారముగా కూడా పిలుస్తున్నాం.

ఆంధ్రదేశంలో సౌర, చాంద్ర మానాలున్నప్పటికీ లోక వ్యవహారాన చాంద్రమానం పిలువబడుతుంది. వింధ్యకు ఉత్తరభాగాన గల ప్రాంతాలలో బార్హస్పత్యమానం అనగా గురువును కేంద్రంగా వ్యవహారాన గ్రహింపబడుతున్నది.

శ్రీపతి అనే మహాశయుడు శ్రీ ప్రభవాది నామ సంవత్సరం నుండి అక్షయ నామ సంవత్సరం వరకు 60 సంవత్సరములు 12 భాగాలుగా చేసి, ఒక్కొక్క భాగంలో 5 సంవత్సరాలు వుండేట్లు నిర్ణయించి, ఈ 12 భాగాలను 12 యుగాలుగాను వీటికి పేర్లను నిర్ణయించాడు. ఈ క్రమంలో 1987 – 88వ సంవత్సరానికి శ్రీ అక్షయతో 60 సంవత్సరాలు పూర్తయ్యి తిరిగి శ్రీ ప్రభవతో మరో భ్రమణం ప్రారంభమై శ్రీ నందన నామ సంవత్సరంతో 26 సంవత్సరాలు పూర్తికాబడి, 27వ సంవత్సరమైన శ్రీ విజయనామ సంవత్సరం ఈ ఉగాది పర్వదినంతో ప్రారంభమౌతుంది. ఈ క్రమంలో సంవత్సర, పరివత్సర, ఇదావత్సర, అనువత్సర, ఇద్వత్సరాణాం అనే 5 యుగాలు గడచిపోగా ఆరవ యుగమైన 'అహిర్భుద్నిని' అను యుగము శివ దేవతాకమైనది. దీనిలో మొదటిది శ్రీ నందన నామ సంవత్సరం, రెండవది శ్రీ విజయ నామ సంవత్సరం. దీనికి అధిదేవత సూర్యుడు.

### అధిపతులు

రాజు – గురువు; మంత్రి – రవి; సేనాధిపతి – శుక్రుడు; సస్యాధిపతి, నీరసాధిపతి – కుజుడు; ధాన్యాధిపతి – చంద్రుడు; ఆర్ఘ్యాధిపతి, మేఘాధిపతి – శని;

### ఫలితాలు

సాయన మేష సంక్రమణకు లగ్నం కుంభమై, లగ్నానికి గురు వీక్షణ లగ్నాధిపతి దశమకేంద్ర స్థితి రాహువుతో యుతి. అంశంలో బుధాంశనుపొంది బుధునిచే వీక్షింపబడుతుంది. ఈ సంవత్సరం రాజుగా గురువు. సేనాధిపతిగా శుక్రుడు కావడం విశేషం. ఇరువురూ శుభులైనప్పటికీ ఈ ఇరువురి మధ్య కించిత్‌వైరం మరియు అరిష్టగ్రహస్థితులు అధికంగా వున్నందున శ్రీ విజయనామ సంవత్సరం పేరుకు తగ్గట్టుగా విజయపథంలో వెళ్లటం లేదు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పరిపూర్ణ శుభత్వంతో కూడిన పరిపాలనను ప్రజలకు అందించలేవు. ప్రభుత్వ పాలనా యంత్రాంగంలో వైఫల్యాలధికం. మేష, మిథున రాశులలో చాతుగ్రహ, పంచగ్రహ కూటములతోపాటు అనేక త్రిగ్రహ కూటములు, మిథునం నుంచి తుల వరకు, కన్య నుంచి ధనుస్సు వరకు ఏర్పడిన గ్రహ అచ్ఛాదనల వల్ల వాతావరణం తరచూ వ్యతిరేకంగానే వుంటుంది. ఈ సంవత్సరం ఏర్పడే చంద్ర, సూర్య గ్రహణాల ప్రభావం ద్వాదశ రాశులపై ఫలితాలేమీ చూపవు. ఈ సంవత్సరం జ్యేష్ట పూర్ణిమ ఆదివారం మూలా నక్షత్రంలో ఏర్పడే పెద్ద జాబిలి అధికభాగం వ్యతిరేక ప్రభావాలను ద్వాదశ రాశులపై చూపుతుంది. కానీ భయాందోళనలు చెందనవసరం లేదు. జ్యేష్ట పూర్ణిమ లగాయితు పుష్య పూర్ణిమ వరకున్న ఎనిమిది పూర్ణిమ రోజులలో సముద్ర స్నానాలు చేసేవారు పలు జాగ్రత్తలు తీసుకోవడం అవసరం.

### వర్ష భీభత్సాలు!

జూలై 19 నుండి పుష్యమి కార్తె ప్రవేశం కావటం తదుపరి మూడు రోజులలో మిథునరాశిలో గురు, కుజులు ఒకే బిందువులో కలయిక జరగటం వర్షభీభత్సాలకు తావున్నది. ఆగష్టు 16 నుండి ఆగష్టు 30 తేదీలోగా నీచ కుజుడు ఉచ్ఛశనుల వీక్షణల వల్ల సముద్రంలో ఆటుపోట్లు, వాయు గుండాలు, అధిక వర్షపాతం కలదు. తుఫాన్లు తప్పిపోతాయి. వ్యవసాయదారులకు ఆగష్టు నుంచి నవంబరు వరకు ఆశాజనక పరిస్థితులున్నప్పటికీ వాతావరణ హెచ్చరికలు గుర్తుంచుకొని తగినరీతిలో స్పందించాల్సి వుంటుంది. అయితే కొన్ని గ్రామాలలో నీటి ఎద్దడి అధికంగా వుంటుంది. చిన్న చిన్న పరిశ్రమలు మూతపడతాయి. రోడ్డు, రైలు, విమాన ప్రయాణాలలో ప్రమాదాలధికం. దేవాలయ సంపద ధైర్యంగానే దోపిడీ చేస్తారు. అధికారులకు, పాలకులకు మధ్య బేధాభిప్రాయాలు, అధికారుల బదలీలు వివాదాస్పదమౌతాయి. సినిమా పరిశ్రమ సామాన్యంగా వుంటుంది. క్రీడా, వాహన ఉత్పత్తి రంగాల వారికి విశేష ప్రయోజనాలుంటాయి. రాజకీయ నాయకులకు కోర్టు తీర్పులు వ్యతిరేకంగా వస్తాయి. రాజకీయ సంక్షోభం ఏర్పడగలదు. న్యాయరంగం తన సత్తాను తెలియజేస్తుంది.

### సర్వులపై శని ప్రభావం!

తులారాశిలో కుజ, శని, రాహువులు కలవటం విపరీతం అనర్థాలకు హేతువు కానున్నది. ఈ కలయిక అనేక దశాబ్దాల తర్వాత వస్తుండడం విశేషం. ఈ సంవత్సరమే సార్వత్రిక ఎన్నికలు జరుగుతుండడం, మంత్రిత్వ, మోఘాదిపత్యాలను కైవసం చేసుకొన్న శని, సస్య నీరసాధిపత్యములు వచ్చిన కుజునికి మధ్యగల వైరం తీవ్రస్థాయిలో వున్నందున దానిప్రభావం సమస్త రంగాలపైనా, ప్రజలపైనా, పాలకులకూ వ్యతిరేకంగా వుండే అవకాశం అధికం. దేశారిష్ట యోగాలు తుఫాన్లు, వరదలు, ఆస్తి, జన నష్టాలు, మత ఘర్షణలు, రాజకీయ మార్పులు, అధిక వర్షపాతం ఏర్పడే అవకాశాలున్నాయి.

అయితే కంప్యూటర్, టెలికమ్యూనికేషన్స్, సాఫ్ట్‌వేర్ రంగాలలో నూతన ఆశలు చిగురిస్తాయి. అంతరిక్ష పరిశోధనా రంగంలో భారత దేశం విజయకేతనం ఎగురవేస్తుంది. ప్రింట్, ఎలక్ట్రానిక్ మరియు సినిమా రంగాలలో సామాన్య వృద్ధి కనిపిస్తుంది. ఆధ్యాత్మిక, జ్యోతిష రంగాలపై ప్రజలు మక్కువ చూపుతారు. రాష్ట్రాల నడుమ విభేదాలు తారాస్థాయిలో వుంటాయి. ఎరుపు ధాన్యాలు, ఎరుపు నేలలో పండించే పంటలు పుష్కలంగా లభిస్తాయి. కేంద్ర ప్రభుత్వం ఆశించిన స్థాయిలో ప్రపంచాధిపతుల సహకారం పొందలేకపోవచ్చు. ప్రభుత్వానికి కొన్ని విషమ సమస్యలెదురౌతాయి. అభద్రతా భావాలు గోచరించినా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పరస్పరం సంప్రదించుకొంటూ ప్రజల అనురాగం పొందుతాయి. షేర్ మార్కెట్లు ఒడిదుడుకులుగా వుంటాయి.

| రాశులు | ఆదాయం | వ్యయం | రాజపూజ్యత | అవమానం |
|---|---|---|---|---|
| మేషం | 11 | 5 | 2 | 4 |
| వృషభం | 15 | 14 | 5 | 4 |
| మిథునం | 8 | 11 | 1 | 7 |
| కర్కాటకం | 2 | 11 | 4 | 7 |
| సింహం | 5 | 5 | 7 | 7 |
| కన్య | 8 | 11 | 3 | 3 |
| తుల | 5 | 11 | 6 | 7 |
| వృశ్చికం | 11 | 5 | 2 | 6 |
| ధనస్సు | 14 | 11 | 5 | 6 |
| మకరం | 2 | 8 | 1 | 2 |
| కుంభం | 2 | 8 | 4 | 2 |
| మీనం | 14 | 11 | 7 | 2 |

### శుక్ర మౌఢ్యమి

శ్రీ నందన నామ సంవత్సరం మాఘ శుద్ధ శనివారం 16.2.2013 తేదిన ఏర్పడిన శుక్ర మౌఢ్యమి శ్రీ విజయ నామ సంవత్సర చైత్ర బహుళ తదియ ఆదివారం 28.4.2013నకు అంతమవుతుంది. తిరిగి పుష్య శుద్ధ సప్తమి మంగళవారం 7.1.2014 ఉదయం 10.15 నిమిషాల నుండి పుష్య బహుళ పాడ్యమి గురువారం 16.1.2014 సాయంత్రం 4.52 నిమిషాలకు అంతమగును.

### గురు మౌఢ్యమి

వైశాఖ బహుళ ద్వాదశి మంగళవారం 4.6.2013 సాయంత్రం 6.24ని॥ల నుండి జ్యేష్ట బహుళ ద్వాదశి బుధవారం 3.7.2013 రాత్రి 3.50 నిమిషాలకు అంతమవుతుంది.

### వాస్తు కర్తరి

మే నెల 4తేది శనివారం మధ్యాహ్నం 2 గంటల 13 నిముషాలకు రవి భరణీ నక్షత్ర 3వ పాదంలో ప్రవేశంతో డొల్లు కర్తరీ ప్రారంభమౌతుంది. మే నెల 29తేది మంగళవారం వైశాఖ బహుళ చవితి రాత్రి 7 గంటల 5 నిమిషాలకు రోహిణీ 2వ పాదంలో రవి ప్రవేశంతో కర్తరీ త్యాగమవుతుంది.

### రవి ఆరుద్ర ప్రవేశం

విజయ నామ సంవత్సరం జ్యేష్ట శుద్ధ చతుర్దశి శుక్రవారం తెల్లవారుజామున 4 గంటల 34 నిముషాలకు తెల్లవారితే శనివారం అనూరాధ నక్షత్రం వృషభ లగ్నంలో రవి ఆరుద్ర నక్షత్రంలో ప్రవేశిస్తాడు. దీనివల్ల ఈ సంవత్సరం ఉష్ణోగ్రతలు తీవ్రంగా వుంటాయి. సముద్రంలో తరచూ పరితల ఆవర్తనాలు, ద్రోణులు అధికంగా ఏర్పడినప్ప టికీ వర్షపాతం మాత్రం తక్కువ. నైరుతి రుతుపవనాలు స్వల్ప ఆలస్యంగా ప్రవేశిస్తాయి. రుతుపవనాల ప్రభావం తక్కువగా వుంటుంది. J

Regn.No. : RN 1156 / 57
J/Nellore/008/12-14
జమీన్‌రైతు